# Jeevan and Hanu introduce:
# The World's Oddest Figures





The shortest adult ever known was ***Pauline Musters*** of Holland. At 19 years she measured merely 23·2 inches!



The world's heaviest human was ***Robert Hughes*** of the U.S.A.- he grew from an 11·14 pound baby to a 1,069 pound adult.



The longest human neck: the 15 3/4 inch record is held by a woman of Burma's ***Padaung tribe.*** Copper coils are fitted around the neck to elongate it!



The world's tallest man was ***Robert Wadlow*** of the U.S.A. His height at 20 years- 8 feet, 11·1 inches!



The lightest human on record was ***Lucia Zarate*** of Mexico. 2½ pounds at birth, she weighed only 13 pounds at 20 years.

**Life Insurance is the safest, surest way to protect your future. Find out about it.**



**Life Insurance Corporation of India**

*Next: The Two Find-outers say hello to the world's human-est creatures.*

**Results of Candamama—Camlin Colouring Contest No. 16 (Telugu)**

*1st Prize:* Baby K. L. Gayathri, Srikakulam. *2nd Prize:* N. V. Sharavan Kumar, Hyderabad. *3rd Prize:* N. Sreenivas, Hyderbad. 500 035. *Consolation Prizes:* M. Sureshkumar, Hyderabad-42; P. Srihari Rao, Kurabal Kota, Godavarthi Srinivas, Vetlapalem; T. J. Balaji, Pakala; C. H. Durga Prasad, Guntur.



# చందమామ

డిసెంబర్ 1980



ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు






విడి ప్రతి: 1-50

సంవత్సర చందా: 18-00



# చందమామ


సంస్థాపకుడు : 'చక్రపాణి'

సంచాలకుడు : నాగిరెడ్డి


---

"దేవీభాగవతం" రంగుల సీరియల్, ఈ సంచికలో పూర్తి అవుతున్నది. వచ్చే నెల సంచికలో "విఘ్నేశ్వరుడు" ప్రారంభమవుతుంది.

ఈ నెల బేతాళకథ ["లౌక్యం తెలిసినవాడు"]కు ఆధారం బొమ్మిడి అచ్చారావు రచన.

## అమరవాణి

సంతోషామృత తృప్తానాం, యత్సుఖం శాంతచేతసామ్,
కుత స్తద్ధనలుబ్ధానాం, ఇతశ్చేతశ్చ ధావతామ్.

[అమృతం వంటి సంతోషాన్ని అనుభవిస్తూ, శాంతమైన మనస్సు కలవారే సుఖవంతులు. ఇలాంటి సుఖం ధనాశాపరులై, నానా శ్రమలూ పడే వారి కుండదు.]

---


సంపుటి 67 డిసెంబర్ '80 సంచిక 6

విడి ప్రతి : 1-50 : : సంవత్సర చందా : 18-00




ఎ. పూర్ణచంద్రరావు, విశాఖ

ప్ర: మానవ ఉష్ణోగ్రత 98.4 డిగ్రీలు. వేసవిలో 98.5 గాని 99 గాని ఉన్నప్పుడు అది మన మామూలు శరీర ఉష్ణోగ్రతకు సమానమే కదా? శరీర తాపం ఎందువలన కలుగుతుంది? జ్వరం 104 డిగ్రీలు ఉన్నచో మనిషి నడువ లేడు. కాని ఎండాకాలంలో సదరు ఉష్ణోగ్రతలో నడిచి పోతున్నాడు. ఎందువలన?

న: వాతావరణం ఉష్ణోగ్రతతో నంబంధం లేకుండా శరీరం తన ఉష్ణస్థితిని ఒకే స్థాయిలో —98.4 డిగ్రీలలో—ఉంచుకోగలందులకు తగిన ఏర్పాట్లు కలిగి ఉన్నది. మొదటి సంగతి: శరీరంలో అనుక్షణమూ ఉష్ణం ఉత్పత్తి అవుతూ ఉంటుంది. దానివల్ల శరీర ఉష్ణస్థితి అదుపు మించకుండా చెమట ద్వారానూ, ఊపిరి ద్వారానూ, ఇతర విసర్జనల ద్వారానూ వేడిని శరీరం వదులుతూ ఉంటుంది. వాతావరణం ఉష్ణస్థితి శరీరస్థితికి నమం అయేసరికి శరీరం తాను అనుక్షణమూ ఉత్పత్తి చేసే అదనపు వేడిమిని గాలిలోకి వదలటం సాధ్యం కాదు. చెమట పట్టుతుంది కాని అది ఆవిరి అయితే తప్ప శరీరం చల్లబడదు. గాలిలో తేమ ఎక్కువగా ఉంటే చెమట ఆవిరి కాదు. అలాటప్పుడు పంఖాల ద్వారా చెమటను ఆవిరిగా మార్చి ఒంటికి చల్లదనం తెచ్చుకోవాలి. అదే విధంగా చలిదేశాలలో ఉష్ణస్థితి మంచుకన్న చాలా తక్కువకు దిగిపోతుంది. అప్పుడు శరీరం అనుక్షణమూ తయారు చేసే వేడి చాలకపోవచ్చు. శరీర ఉష్ణాన్ని హెచ్చించటానికి ఆహారం ఎక్కువ తినాలి. శరీరంలో తయారయే వేడి బయటి గాలిలోకి పోకుండా ఉన్ని దుస్తులూ, తోలు దుస్తులూ ధరించాలి. ఉన్ని దుస్తులు వేడి కలిగిస్తాయని కొందరు అపోహపడతారు. అవి వేడిని నిరోధిస్తాయి. అందుకు నిదర్శనంగా మనం మంచుగడ్డను ఉన్ని బట్ట మధ్య చుట్టిపెడితే అది కరగకుండా, బయటి వేడిని మంచుగడ్డకు సోకకుండా నిరోధిస్తుంది.

బయట వేడి 104 డిగ్రీలున్నా శరీరఉష్ణస్థితి 98.4 మాత్రమే ఉంటుంది. జ్వరం వచ్చి శరీర ఉష్ణం 104 వచ్చాక, బయట మంచు పడుతున్నా మనిషి నడవలేడు. వాడు నడవలేక పోవటానికి కారణం జబ్బు; వేడికాదు.



# రంగరాజు పెళ్ళికథ

రంగరాజుకు పాతికేళ్లు వస్తున్నా బాధ్యతలు తెలియవు. తండ్రి వాడికి ఏ బాధ్యతా అప్పగించకుండా పెంచి పెద్ద చేశాడు. దానికి తోడు వాడికి చదువైనా అంతగా అబ్బలేదు. వాడు తిని తిరుగుతూ, స్నేహితులతో పోచుకోలు కబుర్లు చెబుతూ కాలం గడిపాడు. వాళ్ళకు చెప్పుకోదగిన ఆస్తిపాస్తులు కూడా లేవు.

అయినా వాడికి పిల్లనియ్యటానికి ఎంతోమంది ఆరాటపడ్డారు. ఎందుకంటే వాడు చాలా అందంగా ఉండేవాడు.

''నీ అందానికి తోడు ఏదన్నా ఉద్యోగం చూసుకున్నావంటే, అప్సరస లాటి అమ్మాయి వస్తుంది,'' అనే వాళ్ళు వాణ్ణి ఎరిగిన వాళ్ళు.

''మా నాన్న సంపాదనతో ఇంకో మనిషిని పోషించలేక పోతామా?'' అనే వాడు రంగరాజు; పని చెయ్యటం మాట వింటే వాడికి తేళ్ళూ, జెర్రులూ పాకినట్టుండేది.

ఇలా ఉండగా, ఒకనాడు, రంగరాజు స్నేహితుడు పారుగూర్లో ఏదో సంబంధం ఉన్నదని తెలిసి, చూసి వచ్చి తన అనుభవం ఇలా చెప్పాడు:

''పిల్ల అప్సరస! కట్టుకు పోయినంత ఆస్తికి వారసురాలు! కాని, పిల్ల తల్లి దుర్గమ్మ, తన కూతురి అందానికి నేను తగనని నా మొహానే అనేసింది. నువు వెళ్ళి చూడు. ఆ పిల్లను చేసుకో గలిగితే నీకు ఉద్యోగం అక్కర్లేదు. హాయిగా ఇల్లరికం ఉండిపోవచ్చు!''

రంగరాజుకు ఈ ఆలోచన బ్రహ్మాండంగా నచ్చింది. మర్నాడు వాడు, తండ్రికి కూడా చెప్పకుండా పారుగూరు వెళ్లాడు.

దుర్గమ్మ ఇల్లు తేలికగానే దొరికింది. రంగరాజు తలుపు తట్టగానే దుర్గమ్మ

మాచిరాజు కామేశ్వరరావు



స్వయంగా వచ్చి తలుపు తీసి, "ఎవరు నువు? చూడబోతే మా రాణిని చూడటానికి వచ్చినట్టున్నావే?" అన్నది రంగరాజును ఎగాదిగా చూసి.

ఆమె లావుపాటిది, విధవరాలు.

రంగరాజు ఆమె మాటకు అంగీకరించినట్టు తల ఆడించాడు.

"అమ్మా, రాణీ! మరో అబ్బాయి వచ్చాడే!" అని దుర్గమ్మ కేక పెట్టింది.

రాణి తాను చదువుకుంటున్న పుస్తకంతో ఇవతలికి వచ్చి, "మళ్ళీ పెళ్ళి చూపులా?" అని విసుక్కున్నది.

రంగరాజు ఆ పిల్ల అందం చూసి కరిగి పోయాడు.

"మీ పేరు? ఊరు? చదువు? అలవాట్లు?" అంటూ ప్రశ్నల వర్షం కురిపించి, సమాధానాలు చెప్పించుకుని, రాణి లోపలికి వెళ్ళిపోయింది.

"ఇక నువు వెళ్ళు, బాబూ. మా ఉద్దేశం తరవాత తెలియజేస్తాం," అన్నది దుర్గమ్మ రంగరాజుతో.

ఆ ఇంటి వైభవమూ, రాణీ అందచందాలూ చూసినాక రంగరాజుకు తన అదృష్టంలో నమ్మకం చిక్కలేదు. కాని వారం రోజుల తరవాత దుర్గమ్మ ఎవరితోనో కబురు పంపింది, "అబ్బాయి నచ్చాడు; ముహూర్తం పెట్టించండి!" అని.

రంగరాజు ఎగిరి గంతువేశాడు. రంగరాజుగాడి రొట్టె విరిగి నేతిలో పడిందని అందరూ అసూయపడ్డారు.

"కలిగిన సంబంధం! పిల్ల ఆస్తి అంతా మీదే! కట్నాలూ, కానుకలూ అంటూ నోరుజారి సంబంధం చెడగొట్టుకోకండి!" అని అందరూ రంగరాజు తండ్రిని గట్టిగా హెచ్చరించారు.

నెల తిరగకుండానే రంగరాజు పెళ్ళి వైభవంగా జరిగిపోయింది. నాలుగు రోజులుండి, ఇతర బంధువులతోబాటు రంగరాజు తండ్రి కూడా వెళ్ళిపోయాడు.

అత్తగారు తనను ఇల్లరికం ఉండి పొమ్మంటుందని రంగరాజు ఎంతో [illegible]

పడ్డాడు. కాని దుర్గమ్మ అలాటిదేమీ అనకపోగా, "ఇది విన్నావా, అల్లుడూ? మునసబుగారి రెండో అల్లుడు నెలకు పదిహేను రోజులు అత్తవారింట్లోనే తిష్ఠ వేసి, గేదెలా మేస్తాడట! నేనైతేనా తన్ని తరిమేస్తాను!" అన్నది, మాటల సందర్భంలో.

రంగరాజుకు తల తిరిగి నట్టయింది. అత్తకు తనను ఇల్లరికం ఉంచుకునే ఆలోచన ఏకోశానా ఉన్నట్టులేదు!

వాడు రెండు రోజులు ఆగి తెలివిగా దుర్గమ్మతో, "ఈ పెద్ద తనంలో మీరు ఒంటరిగా ఎలా ఉంటారు? మాతోపాటు వచ్చేయండి," అన్నాడు.

"అదేం మాట? ఎవరు ఎక్కడ ఉండాలో అక్కడే ఉండాలి. గట్టిగా యాభై నిండలేదు, అప్పుడే వయసు ఏం ముంచు కొచ్చింది? రేపు మంచిరోజు. మీరు బయలుదేరండి!" అన్నది దుర్గమ్మ ప్రయాణ సన్నాహాలు ఆరంభిస్తూ.

విధిలేక, రంగరాజు రాణిని తీసుకుని ఇంటికి వచ్చేశాడు. ఇన్నాళ్ళూ ఒంటరి వాడు గనక ఏ చీకూ, చింతా లేకుండా బతికేశాడు. ఇప్పుడు రాణి అతనికి నెత్తి మీద బరువుగా తోచసాగింది. తన భార్య ఖర్చులకు కూడా తండ్రిని డబ్బు అడగా లంటే రంగరాజుకు సిగ్గుగా ఉంటున్నది.



కొంత డబ్బు తన దగ్గిర ఉండడం అవసరం. అత్తగారి దగ్గిర నుంచి ఏదో విధంగా కొంత డబ్బు రాబట్టాలి!

"ఏదైనా వ్యాపారం చేస్తాను. మీ అమ్మను అడిగి అయిదు వేలు పట్టుకురా," అన్నాడు వాడు రాణితో.

రాణి విరగబడి నవ్వి, "ఇసక పిండితే నూనె బొట్లు రాలుతాయేమోగాని, మా అమ్మ చేతినుంచి పైసా మాత్రం రాలదు!" అన్నది.

అయినా ఆశ చావక రంగరాజు, వ్యాపారం చెయ్యటానికి తనకు అయిదు వేలు కావాలని ఎవరి ద్వారానో తన అత్తకు కబురు పెట్టాడు.

''పైసా లేనివాడికి వ్యాపారం ఎందుకు? చెత్త కుప్పమీదికి చెత్తేవచ్చి పడుతుంది. లక్ష్మి కూడా డబ్బున్నవాడి దగ్గిరికే వస్తుంది: ఉద్యోగం ఏదైనా చూసుకో మను. బంగారంలాటి పిల్లనిచ్చాను. ఇక నా నుంచి ఏమీ ఆశించ వద్దని చెప్పు,'' అని దుర్గమ్మ రంగరాజు పంపిన మనిషితో అన్నది. ఈ వార్త చేరగానే రంగరాజు నవనాడులూ కుంగిపోయాయి.

ఇక తాను బద్ధకించి లాభంలేదు! సంపాదించని మగాడు కట్టుకున్న భార్యకి కూడా లోకువైపోతాడు. బతికినంత కాలమూ ఎవరిమీదనో ఆధారపడి, ఆత్మాభిమానం లేకుండా బతకడం చాలా నీచం!

రంగరాజు నెలరోజుల పాటు దీక్షగా తిరిగి ఉద్యోగం సంపాదించాడు. ఇప్పుడు వాడికి జీవితం హాయిగా ఉన్నట్టు అనిపించింది. ఇది వరకు రోజు గడవటం చాలా నింపాదిగా గడిచేది. ఒకోసారి విసుగెత్తేది. ఇప్పుడు విసుగులేదు, ఉత్సాహం వచ్చింది.

రంగరాజు ఏడాది గడిచే సరికి తండ్రి అయాడు.

మనవరాలిని చూడడానికి దుర్గమ్మ వచ్చింది. మనవరాలి మెడలో బంగారం గొలుసు వేసి, '' అల్లుడూ,నువు మారావు, నాకు చాలా సంతోషంగా ఉన్నది. నువు చూడటానికి అందంగా ఉన్నావు; నీ కుటుంబం మంచిది అని వాకబు చేస్తే, నువు పరమ బద్ధకస్తుడివనీ, బాధ్యత ఎరగని వాడివనీ తెలిసింది. బరువు మీద పడితే బాధ్యత అదే తెలుస్తుంది లెమ్మని, నీకు పిల్లనిచ్చి చేశాను. నీ బద్ధకం వదల గొట్టడానికే డబ్బు విషయంలో అంత ఖచ్చితంగా ఉన్నాను. ఈ ఆస్తి నేనేం కట్టుకుపోతానా? ఇదంతా నీదే!'' అన్నది.

రంగరాజు ఆమెతో, ''నా సంపాదన మా కుటుంబం సుఖంగా బతకటానికి చాలు. మీకు ముచ్చటగా ఉంటే, మీ కున్నది మీ మనవరాలికి ఇచ్చుకోండి!'' అన్నాడు ఆత్మవిశ్వాసంతో.






# 8

[అరణ్యంలో దారివెతుక్కుంటూ పోతున్న సమరసేనుడికీ, సైనికులకూ, ప్రాణాపాయస్థితిలో వున్న ఒక కొత్త సైనికుడు కనిపించాడు. అతడి వల్ల కుండలినీ ద్వీపాన్నుంచి వచ్చిన కుంభాండుడి రాజద్రోహాన్ని వాళ్ళు తెలుసుకున్నారు. ఆ రాజద్రోహిని హతమార్చటం ఎలాగా అని ఆలోచిస్తున్న సమరసేనుడికి, హఠాత్తుగా చతుర్నేత్రుడు తారసపడ్డాడు. తరవాత—]

మాంత్రికుడు చతుర్నేత్రుడు హఠాత్తుగా తమ ముందు ప్రత్యక్షమయేసరికి సమర సేనుడూ, సైనికులూ భయకంపితులయారు. కొత్త సైనికుడు మరింతగా హడలిపోతున్నాడు. చతుర్నేత్రుడి వేగులైన నల్లగూబా, నరవానరమూ ఆ దాపులనే నిలబడ్డాయి.

చతుర్నేత్రుడు నవ్వుతూ, "భయపడకండి, పరులకు హాని చేయటం నా పని కాదు. ఆ ఏకాక్షి తప్ప, యీ లోకంలో నా కెవరూ శత్రువులు లేరు. అతగాడినైనా, నన్ను హతమార్చాలని చూస్తున్నాడు గనకే, నేను శత్రువుగా భావించవలసి వచ్చింది," అంటూ ఆగి, కొత్త సైనికుడి కేసి చూస్తూ, "ఈ కొత్తవాడెవడు?" అని అడిగాడు.

"నా పేరు ధనపాలుడు. పెద్దపులీ, తోడేళ్ళ కారణంగా ఆపదలోవున్న నన్ను,




వీళ్ళు రక్షించారు,'' అన్నాడు కొత్త సైనికుడు.

చతుర్నేత్రుడు ఆ జవాబుకు అడ్డంగా తల వూపుతూ, ''ఇప్పుడు మీరంతా ఆపదల్లో చిక్కుకోబోతున్నారు. లోగడ మీకు హాని తలపెట్టినవాడెవడైనా వుంటే, వాడు ఆ ఒక్క ఏకాక్ష మాంత్రికుడే! ఇక యిప్పుడు, ఈ ద్వీపానగల దక్షిణపు కొండల ఆవలి నుంచి, మీలాంటి మనుషుల వల్లనే, మీకు ప్రాణాపాయం కలగబోతున్నది,'' అన్నాడు.

వాళ్ళిలా మాట్లాడుకుంటున్న సమయంలో, పొదలమాటున దాగిన యిద్దరు ఆటవికులు, వాళ్ళ కేసి చూస్తున్నారు.

అదేమీ తెలియని సమరసేనుడు, చతుర్నేత్రుడి కేసి రెండడుగులు వేసి, ''చతుర్నేత్రా! మీరు మాంత్రికులైనా, మంచివారులా కనబడుతున్నారు. మీరు చెప్పినట్టు, నిజంగానే మాకు ప్రాణాపాయం కలగబోతూంటే, దాని నుంచి బయటపడే మార్గం తెలియచేయండి,'' అన్నాడు.

చతుర్నేత్రుడు వెంటనే జవాబివ్వక, కొంచెం సేపు ఆలోచిస్తూ వూరుకుని, తరవాత, ''సమరసేనా, ఈ ద్వీపంలో యిన్ని యిక్కట్లకూ మూలకారణం ఆ పడమటి సముద్రతీరంలో సగం మునిగి వున్న ఒకానొక నావ! దానిలో ధనరాసులున్నాయని, అందరూ ఎరిగినదే. ధనంతో కాని పని అంటూ ఏమీ వుండదని కూడా చాలామంది నమ్మకం. ఏకాక్ష మాంత్రికుడికి ఆ ధనం కావాలి; నాకు ఆ నావను కాపలా కాస్తున్న నాగకన్య కావాలి. మీకు ఏం కావాలో చెపితే, నా చేతనైన సాయంచేస్తాను,'' అన్నాడు.

సమరసేనుడు మాట్లాడబోతున్నంతలో కొత్త సైనికుడు ధనపాలుడు వణికిపోతూ పెద్ద కేక పెట్టాడు. సమరసేనుడూ, సైనికులూ అతడి కేసి తలలు తిప్పి, ''ఏం జరిగింది?'' అని అదుర్దాగా అడిగారు.

ధనపాలుడు కొంచెం దూరంగా వున్న పొదల కేసి చేయి చూపుతూ, "అటు చూడండి, ఆటవికులు మళ్లీ తిరిగొచ్చారు. నన్ను చెట్టుకు బంధించినవాళ్ళు వీళ్లే!" అన్నాడు.

సమరసేనుడికీ, సైనికులకూ పొదల చాటున దాగి తమ కేసి చూస్తున్న యిద్దరు ఆటవికులు కనిపించారు. సమరసేనుడు వెంటనే బాణం ఎక్కుపెట్టాడు.

చతుర్నేత్రుడు అతణ్ణి వారిస్తూ, "సమరసేనా, నీ బాణం దెబ్బకు వాళ్ళు అందరు. ఆకాశంలో ఎగిరే గరుడపక్షినీ, పరిగెత్తే చిరుతపులినైనా నీవు హతమార్చ వచ్చు. కానీ, వీళ్ళు మాత్రం నీ బాణ వేగాన్ని మించి పరిగెత్తగలరు. వీళ్ళ సంగతి నేను చూస్తాను!" అన్నాడు.

తరవాత చతుర్నేత్రుడు తల తిప్పి, "నరవానరా! ఉలూకా!" అంటూ కేక వేశాడు. ఆ మరుక్షణం నల్లగూబా, నర వానరం అతడి దగ్గిరకు వచ్చినై.

"నరవానరా, నువ్వు ఆ పొంచి చూసి పారిపోతున్న ఆటవికుల్ని హతమార్చు! ఉలూకా, నువ్వు యీ చుట్టుపక్కల అంతా ఒకసారి వేగు చూసిరావాలి!" అని ఆజ్ఞాపించాడు చతుర్నేత్రుడు.

ఆ వెంటనే నరవానరం కుప్పించి ముందుకు దూకి, పారిపోతున్న ఆట





వికుల్లో ఒకణ్ణి తన బలమైన చేతులతో పడిసి పట్టుకున్నది. ఆటవికుడు భయకంపితుడై, అరణ్యమంతా మార్మోగేలా అరవసాగాడు. నరవానరం వాణ్ణి గాలిలో రెండు, మూడు సార్లు తిప్పి, పైకి ఎగరవేసింది. వాడు అరుస్తూ దూరంగా వున్న రాతిబండల మీద పడిపోయాడు.

నల్లగూబ పారిపోతున్న రెండవ ఆటవికుడి మీదికి రెక్కలాడిస్తూ ఎగిరింది. అది తన వాడి గోళ్ళతో వాడి తలమీద బలంగా కొడుతూ, అరవసాగింది.

ఇది చూసి కొంచెం తేరుకున్న సైనికుడు ధనపాలుడు చుట్టూ కలయచూస్తూ, "దాహంగా వున్నది. దాపుల ఎక్కడైనా నీరు దొరుకుతుందా?" అని పక్కన వున్న సైనికుణ్ణి అడిగాడు.

చతుర్నేత్రుడు చేయి ఎత్తి, "ఎంత దాహంగా వున్నా, తొందరపడి కంటబడిన ఏ నీటి చాయలకైనా, తగు జాగ్రత్త లేకుండా వెళ్ళకండి. ఇది అన్నివిధాలా మహా భయంకరమైన ద్వీపం. నా వెంట రండి, మీకు మంచినీటి కొలను చూపిస్తాను," అంటూ ముందుండి దారి తీశాడు.

అందరూ కొలను దగ్గిరకు వెళ్ళారు. కొలనులో మొసళ్ళూ, తదితర క్రూర మృగాలూ యీదులాడుతున్నవి. అందరూ అవి లేని ప్రాంతానికి పోయి, నీళ్ళల్లో దిగకుండా, ఒడ్డునే వుండి దాహం తీర్చుకున్నారు. సమరసేనుడు కొలను ఒడ్డున వున్న చెట్లనీడన నిలబడి, చతుర్నేత్రుడు చెప్పిన కొత్త విషయం గురించి ఆలోచించ సాగాడు. బహుశా, అతడు దక్షిణ ప్రాంతం నుంచి వస్తున్నారని చెప్పే మనుషులు, ద్రోహి కుంభాండుడూ, అతడి ఆటవిక అనుచరులూ అయి వుంటారని సమరసేనుడు ఊహించాడు.

సమరసేనుడికి, చతుర్నేత్రుడు చెప్పిన నాగకన్య విషయంలోనే అనుమానం తీరలేదు. అతడు, చతుర్నేత్రుడితో, "చతుర్నేత్రా, మరొకలాగా

భావించకు. ధనరాసులున్న నావను నాగ కన్య ఒకతె కాపలా కాస్తూండటం నిజమే గదా ?'' అని అడిగాడు.

''ఇందులో అబద్ధం ఏమీ లేదు. కావాలంటే, నా వెంట రండి, మీకు ఆ నావనూ, నాగకన్యనూ కూడా చూపించ గలను. ఆ ప్రదేశం యిక్కడికి ఎంతో దూరాన లేదు, చాలా దగ్గిర,'' అన్నాడు చతుర్నేత్రుడు.

చతుర్నేత్రుడు దారి తీయగా, సమర సేనుడూ, సైనికులూ అతడి వెనక నడి చారు. కొద్ది సేపట్లో వాళ్ళు ఎత్తయిన ఒక కొండప్రాంతం చేరారు. అక్కడి నుంచి చూస్తే, ప్రశాంతంగా వున్న సముద్రం కనబడుతున్నది.

''అదుగో, నావ కనబడుతున్నదా ?'' అని చతుర్నేత్రుడు తన చూపుడు వేలిని సముద్రం కేసి ఎత్తి సమరసేనుణ్ణి ప్రశ్నించాడు.

సమరసేనుడూ, సైనికులూ అటుకేసి చూశారు. వాళ్ళకు నావ స్పష్టంగా కన బడుతున్నది. అది సముద్రంలో సగ భాగం మునిగిపోయి, చిరిగిపోయిన తెర చాపలతో, అలలతో పాటు తేలియాడు తున్నది. కాని, ఆ ధనరాసులున్న నావను కాపలా కాస్తున్న నాగకన్య మాత్రం వాళ్ళకు కనిపించలేదు.



''ఆ నాగకన్య కనబడదేం ?'' అంటూ సమరసేనుడు ఆశ్చర్యంగా చతుర్నేత్రుణ్ణి ప్రశ్నించాడు.

ఆ ప్రశ్నకు చతుర్నేత్రుడు చిన్నగా నవ్వి, ''సమరసేనా, ఆ నాగకన్య కూడా నీ కళ్ళకు గోచరిస్తే, యిక మా మంత్ర తంత్రాలు గడ్డిపోచకు కొరగావు. ఆ నాగ కన్యను నేనూ, ఏకాక్షమాత్రమే చూడ గలం. ఏకాక్ష ధనం మీది ఆశతో ఆమె మీద పగబట్టివున్నాడు: నేనేమో ఆమెను వరించివున్నాను,'' అన్నాడు.

సమరసేనుడికి తరవాత ఏమి అడి గేందుకూ పాలుపోలేదు. లోగడ తాను ఆ ధనరాసుల సంగతి విన్నప్పుడు వాటిని

వశపరుచుకుని, కుండలినీద్వీపం చేర్చా లనుకున్నాడు. కాని, అది యిప్పుడు తనకు సాధ్యమయేపని కాదని తెలుస్తూనే వున్నది. ఇందులో మరొక చిక్కు, రాజ ద్రోహి కుభాండుడు కూడా వాటికోసమే ప్రయత్నిస్తున్నాడు. వీటికితోడు ఏకాక్షి మాంత్రికుడి బెడద వుండనే వున్నది. అన్నిటికన్న, ఏ మంత్రశక్తి సహాయం లేకుండా, ఆ నాగకన్య కాపలా తప్పించు కుని, నావను చేరటం అసంభవం!

సమరసేనుడు యిలా ఆలోచిస్తు న్నంతలో, అది గ్రహించిన వాడిలా చతుర్నేత్రుడు బిగ్గరగా నవ్వి, "సమర సేనా, నీ మనసులోని తర్కవితర్కాలు నాకు తెలుస్తూనేవున్నవి. ఈ క్షణంలో నాకూ ఒక ఆలోచన వచ్చింది. నీవు ఆ నావలోని ధనరాసుల మీద ఒక కన్ను వేసి వుంచావని, నే నెప్పుడో గ్రహించాను. ఆ ధనం విషయంలో మాత్రం నేను, నీకు పోటీదారును కాను. నీపై పోటీకి వచ్చేవాడు, ఆ ఏకాక్షిగాడే! కనక, మనం యిద్దరం ఏకమైతే, ఏమైనా సాధించ గలమా అని ఆలోచిస్తున్నాను," అన్నాడు.

చతుర్నేత్రుడు యిలా అనేసరికి సమర సేనుడికి ఎంతో ఉత్సాహం కలిగింది. ఈ భయంకర ద్వీపం నుంచి, ప్రాణాలతో ఎలా బయటపడటమా అని ఆలోచిస్తున్న



అతడికి ఒక కొత్త ఆశ కలిగింది. అది, రాజద్రోహి అయిన కుంభాండుణ్ణి హత మార్చాలి. వీలయితే, ఆ నావలోని ధన రాసుల్ని కూడా సంపాయించాలి. అసలు యింతకూ ఆ నావ రహస్యం ఏమిటి?

అన్నిటికన్న ముందు ఆ ధనరాసు లున్న నావ వెనకవున్న రహస్యవిషయం ఏమిటో తెలుసుకోవాలనుకున్న సమర సేనుడు, చతుర్నేత్రుణ్ణి, "చతుర్నేత్రా! మాంత్రికులంటే సహజంగా ఏ మనిషి అయినా భయపడతాడు. కాని, యీ ద్వీపంలోవున్న మీకూ, ఏకాక్షి మాంత్రికు డికీ మధ్య ఎంతో వ్యత్యాసంవున్నది. మీరు భూతదయ, మిత్రవాత్సల్యం వున్న

వాళ్ళలా కనబడుతున్నారు. నేను చేయ గల సహాయం చేస్తాను. కాని, ముందుగా ఆ నావ గురించిన రహస్యం తెలుసుకో వాలని వున్నది,'' అని అడిగాడు.

చతుర్నేత్రుడు వెంటనే జవాబివ్వక, కొంచెంసేపు తటపటాయించి, ''ఆ నావా, ధనరాసులూ, ఆ నాగకన్య కథ—అంతా చెప్పాలంటే చాలా వున్నది. అంతా వినేందుకు నీకు కుతూహలం కూడా లేకపోవచ్చు. కొద్దిలో చెపుతాను విను: బహుశా, నీవు శమనద్వీపం సంగతి విని వుండవు. ఒకవేళ వినివున్నా, మీరు పిలిచే పేరు మరొకటి కావచ్చు. ఆ శమనద్వీపాన్ని శాక్తేయుడు అన్న రాజు పాలిస్తూండేవాడు. శాక్తేయుడంటే నే నీకు తెలిసి వుండాలి—అతడు చండికా భక్తుడు. మంత్రతంత్ర విద్యల్లో అతడికి, అతడే సాటి.

ఒకసారి రాజధానీ నగరంలో దేవీ నవరాత్రి ఉత్సవాలు జరుగుతున్నవి. శాక్తేయుడే స్వయంగా పూజ చేస్తున్నాడు. ఉన్నట్టుండి జనకోలాహలం మధ్యలో చండీదేవి, భక్తులారా! మీ భక్తికి మెచ్చాను. కాని ఒట్టి పూజలతో నాకు తృప్తి కలగడం లేదు. నాకు అపూర్వమైన ఒక చక్కని దేవాలయం కట్టండి,' అంటూ హుంకరించింది.

''తల్లీ! నీకు గొప్పదేవాలయంతో పాటు, ఆకాశాన్నంటే గోపురం కట్టిస్తాను,'' అన్నాడు శాక్తేయుడు మోకరిల్లి.

ఆ వెంటనే చండీదేవి మరింత పెద్దగా హుంకరించి, ''నా దేవాలయం, గోపురాలూ మామూలు రాతితో, మట్టితో కడితే నాకు తృప్తి కలగదు. అంతా వెండీ, బంగారాలతో కట్టించు, అప్పుడే నాకు తృప్తి!'' అన్నది.

శాక్తేయుడు నిలువునా వణికిపోసాగాడు. చండీదేవి ఆజ్ఞ శిరసావహించక తప్పదు. కాని, అంత పెద్ద దేవాలయానికీ, గోపురాలకూ సరిపోయే వెండీ, బంగారాలను సంపాయించటం ఎలా?

—(ఇంకా వుంది)






## లౌక్యం తెలిసినవాడు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, నువు ఈ విధంగా శ్రమపడటం చూస్తూంటే నీకు లౌక్యం తెలియదేమోననిపిస్తున్నది. లౌక్యం తెలిసినవాడు వరహాలశ్రేష్ఠి లాగా అతిహీనస్థితి నుంచి మహోన్నత స్థితికి వస్తాడు. శ్రమ తెలియకుండా ఉండగలందులకు నీకు అతని కథ చెబుతాను, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

ధర్మపురి రాజ్యంలోని ఒక గ్రామంలో వరహాలు అనే ఒక వైశ్యకుమారుడు వ్యాపారం చేసి జీవితం గడపాలని నిశ్చయించుకున్నాడు. చిల్లర వ్యాపారానికైనా కొంత మదుపు కావాలి గనక అతను తన గ్రామంలోని వడ్డీవ్యాపారి వద్ద కొంత

## బేతాళ కథలు

అప్పు చేశాడు. కాని వ్యాపారం అను కున్నంత చురుకుగా సాగని కారణం చేత వరహాలు ఆ అప్పు గడువు లోపల తీర్చ లేకపోయాడు.

వడ్డీవ్యాపారి అతన్ని డబ్బుకోసం తొందర పెట్టసాగాడు. వరహాలు అతనితో, ''త్వరలోనే దివాణం నుంచి మా వాసు దేవుడు వస్తున్నాడు. అతను రాగానే మీ బాకీ తీర్చేస్తాను,'' అన్నాడు.

''వాసుదేవుడా, అయన నీకుతెలుసా?'' అని ఆశ్చర్యంగా అడిగాడు, వడ్డీ వ్యాపారి.

''తెలియక పోవటమేమిటి? వాడు నాకు చాలా దగ్గిర బంధువు!'' అన్నాడు వరహాలు.

''మరి నాకు ఇన్నాళ్ళూ ఈ మాట చెప్పావు కావేమయ్యా? అప్పు తీరికగా తీర్చుదువుగానిలే! నే వస్తా!'' అని వడ్డీ వ్యాపారి హడావుడిగా వెళ్ళిపోయాడు.

వడ్డీవ్యాపారి ప్రవర్తన వరహాలుకు వింతగా తోచింది. అయితే, దానికి అర్థం ఏమిటో మర్నాడే తెలిసిపోయింది.

మర్నాడు వడ్డీవ్యాపారి ఒక కుర్రవాణ్ణి వెంట బెట్టుకువచ్చి, ''ఇదుగో, వీడు నా బావమరిది. మీ వాసుదేవుడికి చెప్పి, వీడికి దివాణంలో ఏదైనా పని ఇప్పించు. ఈ పని చేశావంటే నీ బాకీ చెల్లువేసే స్తాను,'' అన్నాడు.

వడ్డీవ్యాపారి పొరపడ్డాడు. వరహాలు బంధువు వాసుదేవుడు అనే వాడు దివా



ణంలో ఏదో చిన్నపని చేస్తున్నాడు. కాని. అదే పేరుగల ఉన్నతాధికారి దివాణంలో ఒకడు ఉన్నాడు. ఆ ఉన్నతాధికారే వరహాలుకు బంధు వనుకున్నాడు వడ్డీ వ్యాపారి. వరహాలు బంధువుకు ఉద్యోగాలు ఇప్పించే తాహతులేదు.

వడ్డీవ్యాపారి పొరపడ్డాడని తెలియగానే వరహాలు బుర్రలో ఒక ఆలోచన మెరిసింది. ఇతని పొరబాటును నిజం చేస్తే తన బాకీ రద్దు కావటమేగాక, ఊళ్ళో తన పరపతి పెరుగుతుంది!

''సరే, ప్రయత్నిస్తాను. రేపు కనిపించండి,'' అని వరహాలు వడ్డీవ్యాపారిని పంపేసి, ఆ రోజే దివాణానికి వెళ్ళి, తన బంధువైన వాసుదేవుణ్ణి కలుసుకుని, దివాణంలో పనిచేసే పెద్ద పెద్ద ఉద్యోగులందరి పేర్లూ, హోదాలూ, వాళ్ళ జీవితాల తాలూకు వివరాలూ ఒక పుస్తకంలో రాసుకున్నాడు.

తరవాత వరహాలు వాసుదేవుడి కచేరీకి వెళ్ళి, అక్కడి వాళ్ళతో, ''నన్ను మండలాధికారి వీరవర్మగారు పంపించారు. వారి బంధువుకు ఏదో ఉద్యోగం వేయించాలట. నేను వాసుదేవుడుగార్ని కలుసుకోవాలి,'' అన్నాడు.

వరహాలుకు వాసుదేవుడుగారి దర్శనం వెంటనే దొరికింది. వీరవర్మ పేరు చెప్పగానే ఆయన, ''అలాగే చేస్తానని చెప్పు. ఉద్యోగం కావలసిన కుర్రవాణ్ణి రేపు నా వద్దకు పంపమను,'' అన్నాడు.





వడ్డీవ్యాపారి బావమరిదికి మర్నాడే దివాణంలో ఉద్యోగం దొరికింది.

వరహాలు నిమిషాల మీద దివాణంలో ఉద్యోగం ఇప్పించ గలిగాడన్న మాట ఊరంతా పాక్కిపోయింది. అతనికి దివాణంలో గొప్పగొప్ప అధికారుల దగ్గిర పలుకుబడి ఉందని పుకారు పుట్టింది. అందరూ అతని స్నేహం కోసమూ, సహాయం కోసమూ ఎగబడ్డారు. ఉద్యోగాలు కావలసిన వాళ్ళూ, దివాణంలో పనులు అనుకూలంగా చేయించుకో గోరిన వారూ, వరహాలు అడగకుండానే అతనికి కానుకలు అర్పించి, విజ్ఞాపనలు చేసుకో సాగారు. కనకవర్షం ఆరంభమయింది.

వరహాలుశెట్టికి లౌక్యం తోడ్పడింది. సేనాపతీ, కోశాధికారీ, మండలాధికారీ, న్యాయాధికారీ, దుర్గాధిపతీ లాటి అత్యున్నతోద్యోగులందరికీ అతను ఇతరుల మిత్రుడుగా పరిచయమై, క్రమంగా వారికే స్వయానా మిత్రుడయాడు. అతను ఎంతమంది వ్యాజ్యాలో అనుకూలం చేశాడు, ఎందరికో ఉద్యోగాలు ఇప్పించాడు. లక్షలు ఆర్జించి, ఏకంగా రాజధానిలోనే భారీఎత్తున వర్తకం ప్రారంభించి వరహాలశ్రేష్టిగా రాజు దృష్టిలోనూ, మంత్రుల దృష్టిలోను ఘరానా మనిషిగా గుర్తింపు పొందాడు. ఏ గొప్పవాడి ఇంట ఏ అక్కర జరిగినా వరహాలశ్రేష్ఠి ఇచ్చే కానుకలు ప్రశస్తంగా ఉండేవి. రాజుగారి కుటుంబంలో పుట్టినరోజులూ, బారసాలలూ, వివాహాలూ లాటివి జరిగినప్పుడు వరహాలశ్రేష్ఠి వినయంగా, ''చిన్న కానుక!'' అంటూ వెలలేని రత్నాలు ఇచ్చుకోగల స్థితికి వచ్చాడు. ఇప్పుడు అతను కాకిచేత కబురు చేయిస్తే దివాణంలో ఏ పని అయినా అవుతుంది.

ఒకసారి రాజుగారి జన్మదినానికి ఒక ప్రత్యేకమయిన విందు జరిగింది. అందులో చాలా ఉన్నత పదవులలో ఉన్నవారు మాత్రమే పాల్గొన్నారు. ఆ సందర్భంలో ఒకరొకరే తాము ఎలా పైకి

వచ్చినదీ దాపరికం లేకుండా చెప్ప సాగారు. వారిలో వరహాలశ్రేష్ఠి కూడా ఉన్నాడు. అందరూ అంతో ఇంతో నిజం దాచారు గాని, వరహాలు మాత్రం ఉన్నది ఉన్నట్టుచెప్పేశాడు.

అతని కథ విని అందరూ హర్షించి, చప్పట్లుకొట్టారు.

''మీ అందరికన్నా శ్రేష్ఠి లౌక్యం చాలా గొప్పది!'' అని రాజుగారు వరహాలును ప్రశంసించాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, వరహాలు లౌక్యంగల వాడే కావచ్చు. కాని అతను చేసినది మోసమే గదా? ఆ మోసం ద్వారా అతను ఒక వంక లాభం పొందుతూనే ఉన్నాడు గద. అతన్ని అందరూ హర్షించటానికీ, రాజుగారు మెచ్చుకోవటానికీ కారణం ఏమిటి? దీనికి సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో నీ తల పగులుతుంది!'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''ప్రపంచంలో కొందరు ఉన్నతస్థాయిలోనే పుట్టుతారు. కొందరు ఉన్నత స్థాయిని చేరుకుంటారు. ఈ రెండో రకం వాళ్ళకే లౌక్యం అవసరం. రాజు కొడుకులూ, మంత్రి కొడుకులూ ఉన్నత వర్గంలో ఉండటానికి లౌక్యం అవసరం కాదు. వరహాలు ఒకసారి ఉన్నత వర్గంలోకి చేరినాక అతనికి లౌక్యం అవసరం లేదు. కాని, చిల్లర కొట్టు పెట్టుకోవటానికి డబ్బులేని దశ నుంచి రాజధానిలో ఉన్నత వర్తకశ్రేష్ఠి దశను చేరుకున్న వరహాలు లౌక్యం నిస్సందేహంగా అసాధారణమైనది. ఒక సారి ఏ వ్యక్తికయినా, ఉన్నతి లభించి నాక అది ఎలా లభించిందని ఎవరూ పరీక్షించరు. అలా పరీక్షించడం ప్రారంభిసే లౌక్యంతోపైకి వచ్చిన వారందరూ దండనార్హులే అవుతారు. ఫలించని లౌక్యం మాత్రమే శిక్షకు గురి అవుతుంది,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)



# అత్తగారి మెత్తదనం

రమ కాపరానికి వచ్చేటప్పుడు తనను అత్తగారు ఎంతగా కాల్చుకు తింటుందో అనుకున్నది. కాని రమ అత్తగారు సాధువు. ఆమె రమను తల్లికన్న ఎక్కువగా చూసుకునేది. ఆ అలుసుతో రమ బొత్తిగా పనిచెయ్యటం మానేసి, అత్తగారినే ఒళ్ళు విరుచుకో నిచ్చింది.

ఒకనాడు రమ అన్న రమను చూడవచ్చాడు. అతని భార్య కొత్తగా కాపరానికి వచ్చింది. అతన్ని రమ, "మాలతి ఇంటిపని చూసుకుంటూ, అమ్మకు విశ్రాంతి ఇస్తున్నదా?" అని అడిగింది.

"మాలతి పని చెయ్యదు. అమ్మకు ఇప్పుడు పని ఎక్కువయింది," అన్నాడు రమ అన్న.

రమ కోపంగా, "అదేమిటి? మాలతిని పుట్టింటికి పంపెయ్యి. అలాకాని బుద్ధిరాదు!" అన్నది.

"అదే అనుకున్నాను, కాని ఇక్కడ నీ స్థితి చూసి ఆ ఆలోచన మానుకున్నాను. నేను మాలతిని పంపేసిన మర్నాడు బావ నిన్ను మా ఇంటికి పంపేస్తాడు! మీ అత్తకు కూడా నీ మూలంగా పని ఎక్కువయిందట!" అన్నాడు రమ అన్న.

ఆ మాటతో రమకు బుద్ధి వచ్చి, ఇంటి పని చెయ్యసాగింది.

—ఇవటూరి భవానీశంకర్





# ఉత్తమ విద్య

పూర్వం జ్ఞానప్రియు డనే యువకుడు చిన్నతనం నుంచీ కాశీలో ఉండి, గొప్ప గొప్ప గురువులకు శుశ్రూష చేసి సకల విద్యలూ అభ్యసించాడు. అతని పాండిత్యాన్నీ, శాస్త్రపరిజ్ఞానాన్నీ ప్రతివారూ మెచ్చుకున్నవారే.

కాని జ్ఞానప్రియుడికి ఒక విధమైన అసంతృప్తి పట్టుకున్నది. "ఇన్ని విద్యలు నేర్చుకున్నాను గాని, జీవయాత్ర సుఖంగా సాగించటానికి ఇందులో ఒక్కటీ పనికి రాదు. నా చదువులో ఏదో లోటున్నది. అది పూర్తిచేస్తే గాని సంసారసాగరంలో అడుగు పెట్టను," అనుకున్నాడతను.

జ్ఞానప్రియుడు ఎందరో పండితుల దగ్గిరికి వెళ్ళాడు. తాను చదివిన విద్యలన్నీ వారికి చెప్పి, "నా విద్య పూర్తి కావటానికి నే నింకేం చదవాలో దయ చేసి చెప్పండి!" అని అడిగాడు.

వారు అంతా విని, "నీ చదువంతా ముగిసింది," అన్నారు.

ఒక్క వృద్ధుడు మటుకు, "నాయనా, నీ చదువింకా కొద్దిగా దిగబడి వున్నది. కాని నీకా విద్య నేర్పగలవాడు, ఒక్కడే ఉన్నాడు. అతను కమ్మరిపని చేసుకుంటూ ఫలాని గ్రామంలో ఉంటాడు. అతనికి శుశ్రూష చేస్తివా, నీ చదువు పూర్తి అవుతుంది," అని చెప్పాడు.

జ్ఞానప్రియుడికి వృద్ధుడి మాటల యందు గురి కుదిరింది. తన చదువు పూర్తి అవుతుందిగదా అన్న ఆనందం కూడా కలిగింది. ఆయన చెప్పిన ప్రకారం ఆ కమ్మరిని వెతుక్కుంటూ, ఆయన వుండే గ్రామానికి వెళ్ళాడు. కొలిమి తిత్తి వేస్తున్న కమ్మరి ముందు సాష్టాంగపడి, "సకల విద్యలూ పూర్తి చేశాను. కాని నా చదువు ఇంకా కొంచెం

మిగిలిపోయింది. అనుగ్రహించి జీవితానికి అక్కరకు వచ్చే విద్య నేర్పండి.'' అని వేడుకున్నాడు.

కమ్మరి కొలిమి ముందు నుంచి లేచి, ''అట్లా కూచుని తిత్తి వెయ్యి,'' అన్నాడు.

జ్ఞానప్రియుడు తిత్తి వెయ్యసాగాడు.

ఆ రోజు గడిచింది. ఆ వారం గడిచింది. ఆ నెల గడిచింది, ఆ సంవత్సరం కూడా గడిచింది. జ్ఞానప్రియుడు రోజూ తిత్తి వేస్తూనే ఉన్నాడు. కమ్మరి అతనితో ఏమీ మాట్లాడనే లేదు. ''నేనెందుకు వచ్చానో ఆయనకు తెలుసుకదా! మళ్ళీ జ్ఞాపకం చెయ్యడం దేనికి?'' అని జ్ఞానప్రియుడు ఊరు కున్నాడు.

కాని తాను వచ్చి సంవత్సరం నిండినా గురువుగారు తన సంగతి ఎత్తకపోవటం గురించి జ్ఞానప్రియుడు ఖిన్నుడై తిత్తి వెయ్యటం ఆపి, ఒకనాడు, కమ్మరితో, ''స్వామీ, నా చదువు—'' అన్నాడు.

''తిత్తి వెయ్యి!'' అన్నాడు కమ్మరి.

అంతే, గురువు అంతకంటె ఇంకేమీ అనలేదు. జ్ఞానప్రియుడు కూడా మళ్ళీ ఆ ప్రసక్తి ఎత్తలేదు.

ఈ విధంగా అయిదేళ్ళు గడిచాయి.

ఒకనాడు ఉదయం జ్ఞానప్రియుడు కొలిమి వద్దకు వచ్చి కూచుని తిత్తి చేత పట్టుకుంటూండగా కమ్మరి వచ్చి అతని భుజం మీద చెయ్యి వేశాడు. జ్ఞానప్రియుడు లేచి నిలబడి నమస్కారం చేసి, ''ఏమిటి, గురువుగారూ?'' అన్నాడు.

''నాయనా, నీ చదువు పూర్తి అయింది. నువ్వింక ఇంటికి పోయి, పెళ్ళాడి, సుఖంగా సంసారం ఈదగలవు. అన్ని విద్యలనూ మించిన సహనం సంపాదించుకున్నావు!'' అన్నాడు కమ్మరి.

జ్ఞానప్రియుడు పరమానంద భరితుడై తన గురువు వద్ద సెలవు పుచ్చుకుని ఇంటికి వెళ్ళిపోయి, గృహస్థధర్మం స్వీకరించి కలకాలం సుఖంగా జీవించి, గొప్ప జ్ఞాని అనిపించుకున్నాడు.






# అల్లుడి శక్తి

పూర్వం రామశాస్త్రి అనే పేద బ్రాహ్మడికి నలుగురు ఆడ పిల్లలు. నలుగురికీ పెళ్ళిళ్ళు చేసి, వారిని అత్తవారిళ్ళకు పంపేటప్పటికి రామశాస్త్రి తలమునకలుగా అప్పులపాలై, అప్పుల వాళ్ళకు మొహం చూపలేక, ఒకరోజు అర్ధరాత్రి వేళ, ఎవరికీ చెప్పకుండా ఇల్లు వదిలి, పట్నానికి బయలుదేరాడు.

చీకటిలో అతను నడిచి వెళుతూ, ఒక ఊరి వెలపల ఒక పెద్ద మర్రిచెట్టును చేరుకున్నాడు. ఆ చెట్టుమీద కొన్ని వందల ఏళ్ళుగా ఒక బ్రహ్మరాక్షసుడు ఉంటున్నాడు. ఆ సంగతి ఆ సమీపంలో గల గ్రామాల వాళ్ళకు అందరికీ తెలుసు. అందుకని పట్టపగలు కూడా ఎవరూ చెట్టు దాపులకు వెళ్ళరు. అందుచేత, కటిక చీకట్లో తాను ఉండే చెట్టు సమీపంగా వెళుతున్న రామశాస్త్రిని చూసి బ్రహ్మరాక్షసుడు ఆశ్చర్యపడి, "ఆగు! ఆగు!" అని పెద్దగా అరిచాడు.

రామశాస్త్రికి క్షణంపాటు ఒళ్ళు చల్లబడింది. అయినా, స్వతహాగా సమయస్ఫూర్తీ, ధైర్యమూ కలవాడు కావటానా, నలుగురు ఆడపిల్లల పెళ్ళిళ్ళు చేసి అన్ని రకాల భయాలకూ రాటుదేలి ఉండటానా, తన భయాన్ని క్షణంలో జయించి, "ఎవరది?" అని అడిగాడు.

రామశాస్త్రి తన కంఠం వింటూనే భయంతో మూర్ఛపోయి ఉండవలసింది! అలా జరగక పోవటం బ్రహ్మరాక్షసుడికి గొప్ప అవమానమయింది. వాడు చెట్టు మీదినుంచి దభీమని రామశాస్త్రి ముందుకు దూకి, "నేనెవరో తెలియటం లేదా?" అని కోపంగా రంకె పెట్టాడు.

రామశాస్త్రి వాణ్ణి గుర్తించనట్టు అమాయకంగా మొహం పెట్టి, "ఎవరు,

కుమారి బి. వకుళాదేవి



బాబూ, నువ్వా? ఇంత రాత్రి వేళ, చీకట్లో, ఇక్కడికి ఎందుకొచ్చావు? పురుగూ, పుట్రా ఉంటాయి గద! నువ్వు చూడబోతే ఎంతో నాజూకుగా ఉన్నావు!'' అన్నాడు నిబ్బరంగా.

తాను నిజంగానే అందరూ అనుకున్నంత భయంకరంగా లేనేమోనని బ్రహ్మరాక్షసుడికి అనుమానం కలిగింది. వాడు రామశాస్త్రి కేసి అనుమానంగా చూస్తూ, ''నా దగ్గిర దొంగ వేషాలు వేస్తున్నావా? నన్ను చూసి నిజంగా నువ్వు భయపడటం లేదూ? నేనంటే ఈ ప్రాంతంలో భయపడని వాళ్ళు లేరు. నేను బ్రహ్మరాక్షసుణ్ణి! మూడు వందల ఏళ్ళుగా ఈ చెట్టు మీదే ఉంటున్నాను!'' అన్నాడు.

రామశాస్త్రి రాక్షసుడి కేసి నమ్మలేనట్టుగా చూసి, ''అసంభవం. నువ్వు నిజంగా బ్రహ్మరాక్షసుడివైతే భయంతో చచ్చి ఉండనూ? నిన్నుచూస్తే, మా అల్లుళ్ళనుచూస్తే కలిగేభయంలో నాలుగో వంతుకూడా కలగటంలేదు!'' అన్నాడు.

రాక్షసుడికి చాలా ఆశ్చర్యం వేసింది. వాడు ఒక్కసారి తన ఒంటి కేసి చూసుకున్నాడు. అది చూసి రామశాస్త్రి వాడితో మళ్ళీ ఇలా అన్నాడు:

''నీ కళ్ళు చాలా అందంగానూ, సౌమ్యంగానూ ఉన్నాయి. నువ్వు ఎంత కోపంగా చూసినా మా పెద్ద అల్లుడి కళ్ళలో వున్న కోపంలో నూరో వంతు కూడా లేదు, నీ కళ్ళలో! నీ గొంతు ఎంతో మృదువుగా ఉన్నది! నీ అరుపులు మా అల్లుళ్ళ నవ్వుల కన్న వినసొంపుగా ఉన్నాయి!''

బ్రహ్మరాక్షసుడు తన ఆశ్చర్యంనుంచి తేరుకుంటూ, ''మానవుల్లో నాకంటె భయంకరులు ఉండటం సంభవమా? ఈ మూడు వందల సంవత్సరాలలో మానవుల శక్తి అంత పెరిగిందా?'' అనుకుని, సందేహ నివృత్తి కోసం రామశాస్త్రిని, ''ఎందుకయ్యా, అలా గంటావు? నాకు

లేని శక్తీ, బలమూ నీ అల్లుళ్ళకి ఎలా వచ్చాయంటావు? '' అని అడిగాడు.

''నీకు అసలు పెళ్ళి అయిందా, బాబూ ?'' అని అడిగాడు రామశాస్త్రి.

''లేదు. పెళ్ళి అయితే ఏమవు తుంది ?'' అన్నాడు బ్రహ్మరాక్షసుడు.

''అయ్యో, అమాయకుడా! పెళ్ళి మంత్రాలకు ఎంత శక్తి ఉంటుందో నీకు తెలియదా ? ఆ మంత్రాల ప్రభావంతో మామూలు మనుషులే అల్లుళ్ళు అయి పోయి, అంతులేని శక్తి సంపాదించు కుంటారు. మా అల్లుడు కోపంగా చూస్తే చాలు, నేనూ నా కూతురూ, నా భార్యా ఎక్కడివాళ్ళం అక్కడ నీరుగారి పోతాం. ఇంక కోపంగా అరిచాడంటే చెప్పాపూ ? చాపచుట్టగా అందరమూ అతడి కాళ్ళ మీద పడిపోతాం. నీ కోపమూ, నీ అరు పులూ అందుకే, నామీద పనిచెయ్యలేదు!'' అంటూ రామశాస్త్రి బ్రహ్మరాక్షసుడికి బోధ చేస్తున్నట్టుగా చెప్పాడు.

రాక్షసుడు ఆలోచనలో పడ్డాడు. ఈ బ్రాహ్మడి మాట నిజమే అయి, పెళ్ళి కాగానే మానవులకు అంత శక్తి పెరిగే మాటైతే, తనను చూసి భయపడే వారు లేకుండా పోతారు గనక, తాను కూడా పెళ్ళి చేసుకుని, తన శక్తిని పెంచు కోవాలని వాడు అనుకున్నాడు.



రాక్షసుడి మొహం చూస్తున్న రామ శాస్త్రి వాడి ఆలోచనలు గ్రహించి, '' నువు మాత్రం బ్రహ్మచారిగా ఎంతకాలం ఉంటావు ? పోనీ పెళ్ళి చేసుకుని, అంద రినీ నీ అదుపులోకి తెచ్చుకో !'' అని సలహా ఇచ్చి, కదిలాడు.

బ్రహ్మరాక్షసుడికి రామశాస్త్రి సలహా నచ్చింది. వాడు రామశాస్త్రిని వెనక్కు పిలిచి, '' ఇదుగో, నాకు పెళ్ళి ఎవరు చేస్తారు ? నాకు పిల్లను నువే చూడు !'' అన్నాడు.

'' నీ తల దన్నేవాళ్ళు ఇప్పుడు మా మనుషుల్లో చాలా మంది ఉన్నారు. ఎవ రన్నా పిల్లను గొప్పవాడికి ఇయ్యాలను

కుంటారు గాని, నీలాటి అమాయకుడికీ, పేదవాడికీ ఇయ్యటానికి ముందుకు వస్తారా?'' అన్నాడు రామశాస్త్రి.

రాక్షసుడు బాగా లోకువైపోయి, రామశాస్త్రిని బతిమిలాడసాగాడు.

రామశాస్త్రి వాడిచేత చాలాసేపు బతిమాలించుకుని, ''అది అంత తేలిక కాదయ్యా! డబ్బు ఖర్చు చాలా ఉంటుంది. నీ ఇల్లు ఈ మర్రిచెట్టే నంటే ఎవరు పిల్లనిస్తారు?'' అన్నాడు.

''డబ్బు కోసం వెనకాడకు. పిల్లను వెతకటానికి అయే ఖర్చూ, నీకు బహుమతి కూడా ఇచ్చే భారం నాది! పెళ్ళి అయాక ఈ మర్రిచెట్టు వదిలి, పెద్ద భవనంలోకే పోతాను!'' అని బ్రహ్మరాక్షసుడు బంగారు కాసులున్న కుండ తెచ్చి రామశాస్త్రికి ఇచ్చాడు.

రామశాస్త్రి సరేనన్నట్టు తల ఆడించి, ''కాని ఒక షరతు. నేను పిల్లను మాట్లాడే దాకా నువ్వు ఎవ్వరికీ కనబడకు. పెళ్ళికొడుకు కాపరం చెట్టుమీద అని తెలిస్తే వచ్చే సంబంధాలు వెనక్కు పోతాయి. నిన్ను చూసిన జనం నువు జలహీనుడివని ప్రచారం చేసినా ఎవరూ పిల్లనియ్యటానికి రారు! ఎంతో మేటి మనుషులుండగా పిల్లను తీసుకుపోయి ఒక్క బ్రహ్మరాక్షసుడి కియ్యటం పరువు తక్కువ అంటారు!'' అన్నాడు.

బ్రహ్మరాక్షసుడికి రామశాస్త్రి మాట నచ్చింది. తాను పెళ్ళి అయేదాకా ఎవరి కంటా పడనని రామశాస్త్రికి వాడు మాట ఇచ్చాడు. వాణ్ణి అటు తరవాత ఆ చెట్టు మీద ఎవరూ చూడలేదు. ఆ చెట్టు మీద ఒకప్పుడు బ్రహ్మరాక్షసుడు ఉండేవాడని ముసలివాళ్ళు చెబితే పడుచువాళ్ళు, ''మీ వన్నీ మూఢనమ్మకాలు!'' అనేవాళ్ళు.

రామశాస్త్రి బ్రహ్మరాక్షసుడు ఇచ్చిన బంగారంతో ఇంటికి తిరిగి వెళ్ళి, అప్పులన్నీ తీర్చి, అల్లుళ్ళ గొంతెమ్మ కోరికలన్నీ తీర్చి, మిగిలిన డబ్బుతో హాయిగా బతికాడు.






# కోటలో కుక్కలు

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పాలించే కాలంలో, బోధిసత్వుడు నగరానికి సమీపాన గల రుద్రభూమిలో శునకంగా జన్మించి, వందలకొలది శునకాలకు పెద్దగా వుంటూ వచ్చాడు.

ఒక రోజున రాజు తన రథం మీద విహారానికి వెళ్ళి, సూర్యాస్తమయ సమయంలో కోటకు తిరిగి వచ్చాడు. పరిచారకులు రథం గుర్రాలను శాలకు తోలుకు పోయి, రథాన్ని రాజుగారి మేడపక్కన ఉన్న అవరణలో వదిలారు. ఆ రాత్రి పెద్ద వర్షం కురిసి, రథం బాగా తడిసి పోయింది. రాజుగారి పెంపుడు కుక్కలు మేడ దిగివచ్చి, రథానికి వున్న తోలు సామగ్రిని సాధ్యమైనంత వరకు కొరికి తినివేసినై.

మర్నాటి ఉదయం పరిచారకులు రాజు వద్దకు పోయి, సంగతి చెప్పారు. రాజు పట్టరాని కోపంతో, "కుక్కలు నా విహార రథానికే యింతటి హాని చేసినయ్యా! కనబడిన కుక్కనల్లా చంపెయ్యండి," అని ఆజ్ఞాపించాడు.

రాజాజ్ఞతో రాజ్యంలోని కుక్కల వధ ప్రారంభమయింది. కొన్ని కుక్కలు రాజసేవకులను తప్పించుకుని, బోధిసత్వుడు వుండే రుద్రభూమికి పోయి, "అయ్యా, రాజుగారి రథానికి కట్టిన తోలు పరికరాలను ఏవో కుక్కలు కొరికి తిన్నవట. రాజుగారు కనబడిన కుక్కనల్లా చంపమని ఆజ్ఞాపించారు," అని చెప్పినై.

బోధిసత్వుడు వాటి మాటవిని చాలా విచారపడ్డాడు. కోటలో వున్న రథం దగ్గిరకు బయిటినుంచి కుక్కలు వెళ్లే అవకాశం లేదు. ఆ ప్రాంతాన అహోరాత్రాలు కాపలా వాళ్ళుంటారు. కనక, రథానికి కట్టిన తోలు పరికరాలను కోటలో

వున్న కుక్కలే తిని వుండాలి! నేరం చేసిన కుక్కలను రాజుకు పట్టి యిచ్చి, నా పరివారపు కుక్కలను రక్షించు కోవాలి, అనుకున్నాడు బోధిసత్త్వుడు.

ఆయన కుక్కలతో, ''మీరేమీ భయ పడకండి. నేను, రాజు దగ్గిరకు వెళ్ళి వచ్చే వరకూ యిక్కడే ఉండండి,'' అని చెప్పి, ''ధర్మం జయించుగాక! రాజు న్యాయం పాలించుగాక !'' అని మనసులో అనుకుంటూ కోటకు వెళ్ళాడు.

ఆ సమయంలో రాజు సభామంటపంలో సింహాసనం మీద కూర్చుని, న్యాయవిచా రణ చేస్తూ తీర్పులిస్తున్నాడు. బోధి సత్త్వుడు సింహాసనం కిందుగా దూరి పోయి, రాజు ముందు నిలబడ్డాడు. రాజ భటులు ఆయన్ని పట్టుకోబోయారు. కాని, రాజు వాళ్ళను వారించాడు.

బోధిసత్త్వుడు, రాజుకు నమస్కరించి, ''మహారాజా, రాజ్యంలోని కుక్కలన్ని టినీ చంపమని ఆజ్ఞాపించారట, అందుకు కారణం ఏమిటి ?'' అని అడిగాడు.

''అవి మా రథానికి కట్టిన తోలుపరి కరాలన్నిటినీ తిని వేసినై. అందుకే అలా ఆజ్ఞ యివ్వవలసి వచ్చింది,'' అన్నాడు రాజు.

''ఆ నేరం చేసిన కుక్కలేవో తమకు తెలుసా ?'' అని అడిగాడు బోధిసత్త్వుడు.

తెలియదన్నట్టు రాజు తల ఊపాడు. బోధిసత్త్వుడు, ''మహారాజా, నేరం చేసిన కుక్కలేవో తెలుసుకోకుండా, మూక



ఉమ్మడిగా రాజ్యంలోని కుక్కలన్నిటినీ చంపమని ఆజ్ఞాపించటం, ఏం న్యాయం? మీ భటులు కుక్కలన్నిటినీ చంపుతారా లేక కొన్నిటినేమైనా ప్రాణాలతో వదులుతారా?'' అని అడిగాడు.

''రాజ్యంలో వున్న కుక్కలను చంపమని ఆజ్ఞ యిచ్చాను. కోటలో మా పెంపకంలో వున్న కుక్కలకు ఎటువంటి హానీ జరగదు,'' అన్నాడు రాజు.

''మీకు నేరం చేసిన కుక్కలేవో తెలియదు. అయినా, కోటలో వున్న వాటిని వదిలి, మిగతా వాటిని చంపమని ఆజ్ఞాపించారు. మీరు పక్షపాతం, ద్వేషం, అవివేకం, భయం అనే నాలుగు అవగుణాలతో బాధపడుతున్నారు. ఇవి ఏ మాత్రం రాజు కుండవలసిన లక్షణాలు కావు,'' అన్నాడు బోధిసత్వుడు.

రాజు కొంచెం సేపు ఆలోచించి, ''అయితే, నీ బుద్ధిబలం ఉపయోగించి, మా రథపు తోలుసామాగ్రిని కొరికి తిన్న కుక్కలేవో చెప్పగలవా?'' అని అడిగాడు.

''ఆ నేరం చేసినవి కోటలో మీ పెంపకంలోవున్న కుక్కలే. ఆ సంగతి రుజువు చేయగలను,'' అన్నాడు బోధిసత్వుడు.

''ఏదీ రుజువు చెయ్యి, నా ఆజ్ఞను తక్షణం ఉపసంహరించు కుంటాను,'' అన్నాడు రాజు.

బోధిసత్వుడు, రాజుతో కొంత మజ్జిగా, గరికపోచలూ తెప్పించమన్నాడు. పరి



చారకులు అవి తేగానే, గరికపోచలను రుబ్బించి, మజ్జిగలో కలిపి, కోటలోని కుక్కల చేత దాన్ని తాగింపచేశాడు.

ఒకటి, రెండు క్షణాలు గడిచేంతలో కోటలోని కుక్కలు వాంతి చేసుకోవడం ప్రారంభించినై. అవి తిన్న తోలుముక్కలు యింకా పూర్తిగా జీర్ణం కానివి బయట పడసాగినై.

ఇది చూసి ఆశ్చర్యపోతున్న రాజుతో, బోధిసత్వుడు, "మహారాజా, మీ పరిచారకులు, కుక్కలకు సరిగా ఆహారం పెట్టనందువల్ల, అవి ఆకలికి తాళలేక, పోయి, మీ విహార రథపు తోలుసామానులను కొరికి తిన్నవి. ఇది వాస్తవం!" అన్నాడు.

రాజు పరమానంద భరితుడై, "ఈయన శునకరూపంలో వున్న బోధిసత్వుడు తప్ప, వేరెవ్వరూ కాదు." అని సభలోని వారికి చెప్పి, తన శ్వేతఛత్రాన్ని యిచ్చి, బోధిసత్వుణ్ణి భక్తితో పూజించాడు.

బోధిసత్వుడు, రాజుకు ధర్మబోధ చేసి రుద్రభూమిలో వున్న తన పరివారాన్ని కలుసుకునేందుకు వెళ్ళాడు.

రాజు కోటలోని కుక్కల పోషణ చూసే సేవకులను పిలిపించి, విచారించగా, వాళ్ళు ధనం కొంత అపహరిస్తూ, కుక్కలకు సరిగా తిండిపెట్టటం లేదని తెలిసింది. ఆయన వాళ్ళను తగువిధంగా శిక్షించి, కొత్తవాళ్ళకు కుక్కల పోషణ భారం యిచ్చాడు.

రాజు ఆనాటినుంచీ కోటలో వుండే కుక్కలకే గాక, రాజ్యంలోని కుక్కలన్నిటికీ, తగిన ఆహారం పెట్టడానికి కావలసిన సదుపాయాలన్నీ చేశాడు.

ఆ తరవాత రాజు, బోధిసత్వుడి బోధలువింటూ, తన జీవితంలో అనేక మంచి కార్యాలు చేశాడు.

బోధిసత్వుడు ఈ విధంగా చాలా సంవత్సరాలపాటు లోకానికి ధర్మోపదేశాలు చేసి, ఎంతోమందికి తరుణోపాయం చూపాడు.





# నిజమైన విజయం

భారతచరిత్రలో అశోకుడు (అశోక వర్ధనుడు) అత్యంత ప్రముఖుడైన రాజు అని చెప్పాలి. అతను చంద్రగుప్త మౌర్యుడి మనమడు; బిందుసారుడి కొడుకు. అతని మూలానే బౌద్ధమతం వ్యాప్తిచెందింది.

బిందుసారుడికి అనేకమంది భార్యలూ, అనేకమంది కుమారులూ ఉండేవారు. ఎవరో మునిని సందర్శించటం కోసం రాజకుమారులందరూ రాజప్రాంగణంలో సమావేశమై, అందరూ తమ తమ ఆసనాలలో కూర్చున్నారు. కుర్రవాడైన అశోకుడు వచ్చేసరికి అతనికి ఆసనం లేదు.





అశోకుడు నేల మీద చతికిలబడ్డాడు. ఇంతలో బిందుసారుడు మునిని వెంటబెట్టుకుని వచ్చాడు. కటికనేల మీద ఎందుకు కూర్చున్నావని అడిగితే, "భూమాత కన్న ఉత్తమమైన ఆసనం లేదు. అది ఎన్నడూ మోసగించదు," అని అశోకుడు అన్నాడు.



అశోకుడిలో కొన్ని అపూర్వలక్షణాలున్నాయనీ, అతను ఇతరుల మీద బాగా రాణిస్తాడనీ ముని బిందుసార మహారాజుతో అన్నాడు. అశోకుడు పెద్దవాడు అయాక బిందుసారుడు అతన్ని మాల్వా దేశపు పాలకుడుగా ఉజ్జయినికి పంపాడు.

క్రీస్తుపూర్వం 273 లో బిందుసారుడు మరణించాడు. ఈ వార్త తెలియగానే అశోకుడు పాటలీపుత్రానికి వచ్చాడు. తన అనంతరం ఎవరు పాలించవలసినదీ రాజు ప్రకటించ లేదు, పరిస్థితి అనిశ్చితంగా ఉన్నది.





అయితే అశోకుడు రాజధాని చేరగానే అనిశ్చిత పరిస్థితి తొలగి పోయింది. అతను తన పరిపాలనా దక్షతను అప్పటికే నిరూపించుకుని ఉన్నాడు. అంతే గాక అతను ధైర్యవంతుడు, నిర్దయుడు కూడా నేమో. అతన్ని ఎవరూ నిరోధించలేదు. అతను సింహాసనం ఎక్కాడు.

అశోకుడు ఉన్నతాశయాలుగలవాడు. అతన్ని చండాశోకుడు అన్నవారు కూడా ఉన్నారు. అతను మహాసామ్రాజ్యాధిపతి కావాలని ఆశించి, పెద్ద సేననూ, సమర్థులైన సేనాపతులనూ సేకరించాడు.





అతను కొన్ని చిన్న చిన్న రాజ్యాలను లోబరచుకొని, విస్తృతమైన కళింగ దేశం మీద దండెత్తాడు. అనేక రోజుల పాటు మహా దారుణమైన యుద్ధం జరిగింది. కళింగ సైనికులు లోబడలేదు. అందుచేత అశోకుడి సేనలు వారిని ఊచకోత కోశాయి.

ఆ యుద్ధంలో ఒక లక్షమంది చావటం అశోకుడు ఒక కొండ మీద ఉండి చూశాడు. చచ్చిన వారికి రెట్టింపు గాయపడ్డారు. లక్షన్నరమంది బందీలుగా చిక్కారు. విజయం పొందిన అశోకుడు సంతోషానికి బదులు విచారానికి గురి అయాడు.





తీవ్రమైన పశ్చాత్తాపంతో అశోకుడు రాజధానికి తిరిగి వచ్చాడు. ఒక బౌద్ధ భిక్షువు అతనితో, "నిజమైన విజయం కత్తితో రాదు. ప్రేమతోనే అది సాధ్యం," అని చెప్పిన మీదట, అశోకుడికి శాంతి లభించింది.

అశోకుడు తన మంత్రులనూ, సేనాపతులనూ, సామంతులనూ సమావేశపరచి, తాను హింసను శాశ్వతంగా విసర్జించుతున్నట్టు ప్రకటించి, శాంతి దూత అయాడు. విజ్ఞానాన్నీ, ప్రేమనూ ప్రచారం చెయ్యమని అతను అందరినీ హెచ్చరించి, ధర్మాశోకుడుగా ప్రసిద్ధికెక్కాడు.





అశోకుడు దేశం మొత్తం మీద సామాజిక స్వరూపాన్నే మార్చేశాడు : శిలాశాసనాలద్వారా ధర్మసూత్రాలు ప్రచారం చేశాడు. అతని కొడుకూ, కూతురూ బుద్ధుడి సందేశాలను శ్రీలంకకు తీసుకుపోయారు. ధర్మమహామాత్రులూ, ప్రచారకులూ ప్రజలను ధర్మమార్గాన నడిపించారు.




మణీ, రాఘవులూ పెళ్ళిఅయి కాపరం పెట్టినప్పటినుంచీ వారి మధ్య తగవులు ప్రారంభమయాయి. వారి మనస్తత్వాలు ఎంతగా భేదించాయంటే, ఏ కూర వండాలి, ఏ గుడికి వెళ్ళాలి అన్న దగ్గిర నుంచీ వాళ్ళ అభిప్రాయాలు కలిసేవి కావు.

వాళ్ళు అద్దెకు ఉంటున్న ఇల్లు ఖాళీ చేసి, వేరే ఇల్లు చూసుకోవలసి వచ్చింది. రాఘవులు ఇంటికోసం తిరగగా, తిరగగా ఊరి చివర ఒక పాత ఇల్లు అద్దెకు దొరికింది. మంచి రోజు చూసుకుని ఆ దంపతులు ఆ యింటికి మారారు.

ఒకనాటి రాత్రి రాఘవులు దివాణంలో తన పని ముగించుకుని, దివాణంలో వాళ్ళు ఇచ్చిన కూరలతో సహా ఇంటికి వచ్చాడు. భోజనాల దగ్గిర, అతను తెచ్చిన కూరలలో మర్నాడు ఏది వండాలన్న చర్చ వచ్చింది. మణి బీరకాయ కూర చేస్తానన్నది. ఆనపకాయ కూర చెయ్యమన్నాడు రాఘవులు.

''నేను యతి అంటే మీకు ప్రతి అనటం అలవాటే!'' అన్నది మణి.

''నేను చెప్పినది ఎప్పుడు నువు చేస్తానన్నావు గనక?'' అన్నాడు రాఘవులు.

ఇంతలో ఎవరో వీధి తలుపు తట్టిన చప్పుడు అయింది. అప్పుడే చెయ్యి కడుక్కున్న రాఘవులు వెళ్ళి తలుపు తీశాడు. బయటి వెన్నెట్లో ఎవరో ముష్టివాడు జోలెతో కనిపించాడు. వాడు రాఘవుల్ని చూసి, ''బాబూ, మీ కీచులాట ఇందాకటి నుంచీ వింటున్నాను. ఎందుకొచ్చిన తగవు? ఇద్దరికీ ఇష్టమైన రెండు కూరలూ చేసుకోండి!'' అన్నాడు.

''బోడి సలహా! నిన్నెవడు అడిగాడు? వెళ్ళు, వెళ్ళు!'' అని రాఘవులు వాణ్ణి కసిరాడు.

ఎస్. వి. ఆర్. సత్యనారాయణమూర్తి



ఇంతలో వీధి తలుపు చప్పుడయింది. ఎవరా అని మణి వెళ్ళి తలుపు తీసింది. నిన్నరాత్రి కనిపించిన బిచ్చగాడే!

''ఎందుకొచ్చిన తగవులాటలమ్మా! ఎలాగూ రేపల్లా అక్కడ ఉంటారుగదా? ఒక పూట ఎర్రచీరా, ఇంకో పూట నీలం చీరా కట్టుకుంటే పోలా?'' అన్నాడు వాడు.

''నువ్వెవడివి మధ్య? పానకంలో పుడకలాగా! మా విషయం మేం చూసుకుంటాంలే! వెళ్ళు! వెళ్ళు!'' అన్నది మణి.

''ఉండు, ఉండు!'' అని రాఘవులు తన జేబులో నుంచి చిల్లర తీసి, వాడి గిన్నెలో పడేశాడు.

బిచ్చగాడు వెళ్ళిపోయాడు.

''ఉండు, ఉండు! ఈ పులుసు అన్నం పోస్తాను!'' అంటూ మణి వాడి గిన్నెలో పులుసు అన్నం పోసింది.

వాడు సంతోషంతో వెళ్ళిపోయాడు.

మర్నాడు భోజనంలోకి మణి రెండు కూరలు చేసింది. ఆ పూట మరి ఇద్దరి మధ్యా భోజనాల దగ్గిర తగవు రాలేదు.

ఆ రాత్రి ఇద్దరూ, మర్నాడు స్నేహితుల ఇంట పెళ్ళికి వెళ్ళటం గురించి ముచ్చటించుకుంటున్నారు.

''నువు నీలంచీర కట్టుకో!'' అన్నాడు రాఘవులు.

''ఎర్ర చీర కట్టుకుంటాను!'' అన్నది మణి. ఇద్దరూ కీచులాడుకోసాగారు.

మర్నాడు రాత్రి వాళ్ళు పెళ్ళినుంచి తిరిగి వచ్చారు. వాళ్ళు ఇల్లు చేరేసరికి, వీధి అరుగు మీద నిద్రపోతూ బిచ్చగాడు కనిపించాడు.

వాళ్ళు భోజనాలు చేసే రావటం వల్ల ఇన్ని మంచి నీళ్ళు తాగి పడుకున్నారు.

''కంటే ఆడపిల్లనే కనాలి! చక్కగా పెళ్ళిచేసి పుణ్యం సంపాదించ వచ్చు. కన్యాదానం చేస్తే కోటి దానాలు చేసిన ఫలితం అని శాస్త్రులు గారు చెప్పారు!'' అన్నది మణి.

''ఛీ, ఛీ! అదేం కోరిక? తథాస్తు దేవతలు తథాస్తు అనగలరు! ఆడపిల్ల దేనికి? దానికి మొగుణ్ణి వెతకాలి! బోలెడు కట్నం పోసి, పైన ఇంకా బోలెడు ఖర్చు చేసి, దానికి పెళ్ళి చెయ్యాలి! అంతా అయాక అది పెళ్ళి కాగానే మనకు కాకుండా పోతుంది. మగ పిల్లవాడైతే ముసలి తనంలో చేతికి అందివస్తాడు!'' అన్నాడు రాఘవులు.

మళ్ళీ తగవు ఆరంభమయింది.

మళ్ళీ వీధి తలుపు ఎవరో తట్టిన చప్పుడయింది.

రాఘవులు తలుపు తీస్తూ, ''ఏం నాయనా? మళ్ళీ సలహా ఇయ్యటానికి వస్తున్నావా?'' అని ఎదురుగా నిలబడి ఉన్న వ్యక్తిని చూసి నాలిక కరుచుకున్నాడు.

ఆ వచ్చిన వాడు దివాణంలో పని చేసే కొండలు.

''నన్ను చూసి ఎవరనుకున్నావు, రాఘవులూ? ఇవాళ నువు కచేరీకి రాలేదు గదూ? నీకు బాకీ ఉన్న సొమ్ము ఇచ్చేద్దామని వచ్చాను. ఇదుగో!'' అంటూ కొండలు రాఘవులుకు ఒక పొట్లం అందించి వెళ్ళిపోయాడు.

రాఘవులు తలుపు వెయ్యబోతుండగా, బిచ్చగాడు గుమ్మంలోకి వచ్చి, ''బాబూ, నా దొక చిన్నమాట. మీరిద్దరూ ఆడపిల్ల కావాలనీ, కాదు, మగపిల్లవాడు కావాలనీ తగవులాడుకుంటున్నారు గదా!



ఇప్పుడు పక్కవీధిలో మేదరమంచన్న భార్యా, గాజులభూషయ్య భార్యా పురిటి నొప్పులతో బాధపడుతున్నారు. వారిలో ఎవరికి ఏ బిడ్డ పుట్టేదీ మీరు సరిగా చెప్పగలిగితే మీ తగవు నేను తీరుస్తాను!'' అన్నాడు.

ఈ మాటవిని మణి ముందుకు వచ్చి, మంచన్నకి ఆడపిల్ల పుట్టు తుందని చెప్పింది. భూషయ్యకు మగపిల్లవాడు పుట్టుతాడని రాఘవులు చెప్పాడు.

ఆ రాత్రి రాఘవులు నిద్రమేలుకొని, పురుళ్ళు వచ్చిన దాకా తచ్చాడాడు. మంచన్నకు మగబిడ్డా, భూషయ్యకు ఆడబిడ్డా కలిగారు!

బిచ్చగాడు నవ్వుతూ, ''చూశారా? మీరిద్దరూ అనుకున్నట్టు జరగలేదు. ఎవరిక ఎవరు కలుగుతారో అంతా సృష్టి మాయ! సృష్టికి ఆడా, మగా అంతా సమానమే. అందుచేత, ఇకముందు మీరు తగవులాడు కోకండి. ఒకరినొకరు అర్థం చేసుకుని, ఒకరి సంతోషం కోసం ఒకరు పాటు పడండి. అప్పుడే జీవితంలో సుఖసంతోషాలు లభిస్తాయి. నేను బ్రతికి ఉన్నప్పుడు ఎన్నో కాపురాలు సరిదిద్దాను! ఇంకా నాలో ఆ కోరిక చావక ఈ రూపంలో ఉన్నాను!" అన్నాడు.

వాడి మాటలు వింటూంటే భార్యా భర్తలశరీరాలు భయంతోజలదరించాయి. మైకం వచ్చినట్టయింది. ఆ మైకం దిగి పోయే సరికి వాళ్ళ కెదురుగా బిచ్చ గాడు లేడు.

వాళ్ళకు ఎక్కడలేని భయమూ పట్టు కున్నది. ఊరి చివరన ఇల్లు! చుట్టూ చెట్లూ, చేమలు! ఇల్లు మారదామంటే అది ఎంత మాత్రమూ సాధ్యంగా కనబడ లేదు. అందుచేత, వాళ్ళు దయ్యానికి వెరిచి, కీచులాడుకోవటం మానే శారు. తరవాత వాళ్ళకు జీవితంలో ఎంతో ఆనందం కనబడింది. దానితో వాళ్ళు దయ్యాన్ని క్రమంగా మరిచి పోయారు. అది వాళ్ళకు మళ్ళీ ఏనాడూ కనిపించలేదు.



# మనిషి – కర్తవ్యం

రవివర్మ అనే యువకుడు రాజుగారిని కలుసుకుని తనకు ఏదైనా పని యిప్పించమని కోరాడు. ఆ కుర్రవాడు సజ్జనుడులాగా ఉన్నట్టు కనబడటం వల్ల రాజు మంత్రిని పిలిచి, అతనికి తగిన పని యిప్పించమన్నాడు. మంత్రి రవివర్మకు తన కార్యాలయంలో ఏదో పని ఇప్పించాడు.

రవివర్మకు అప్పగించిన పని చురుకుగా సాగక, రోజులు గడిచిన కొద్దీ పని పేరుకు పోతూ వుండటం మంత్రి గమనించి కారణం ఆరా తీయగా, రవివర్మ గొప్ప దైవభక్తుడనీ, రాత్రిం బవళ్ళు దేవాలయంలోనే ఉంటాడనీ తేలింది. మంత్రి అతన్ని పిలిచి, పని శ్రద్ధగా చెయ్య నందుకు చివాట్లు పెట్టాడు.

"అయ్యా, నాకు జన్మను ప్రసాదించిన భగవంతుడికి నా కృతజ్ఞత తెలుపుకునేటందుకు అహోరాత్రాలు చాలటం లేదు," అన్నాడు రవివర్మ.

"అలాగా? అయితే నీకు ఉద్యోగం ఇచ్చిన రాజుగారికి కూడా నీ కృతజ్ఞత తెలుపు కుంటూ ఉండు!" అన్నాడు మంత్రి.

అది భావ్యంగా తోచి, రవివర్మ రోజూ రాజుగారిని దర్శించి, ఉద్యోగం ఇచ్చినందుకు కృతజ్ఞత చెప్పకోసాగాడు. నాలుగు రోజులు చూసి రాజు చిరాకుపడి అతన్ని ఉద్యోగం నుంచి తొలగించాడు.

రవివర్మ మంత్రిని కలుసుకుని, "తమ సలహా ప్రకారం చేస్తే ఉన్న ఉద్యోగం కాస్తా పోయింది," అన్నాడు.

"పోదామరి? రాజుగారు నీకు ఉద్యోగం ఇచ్చినది పని చెయ్యటానికి! దేవుడు నీకు జన్మ ఇచ్చింది నీ కర్తవ్యం నెరవేర్చడానికి! అంతే గాని నువు రాజు గారినీ, దేవుణ్ణీ పొగడ డానికి కాదు," అని మంత్రి బాగా చివాట్లు పెట్టి, తిరిగి ఉద్యోగం ఇచ్చాడు. ఈసారి రవివర్మ తన ఉద్యోగాన్ని శ్రద్ధగా చేసుకున్నాడు. — "వాణిశ్రీ"






# ఎదురింటి మంగమ్మ

చంపక దేశపు సరిహద్దులో ఉన్న శంభ వరం అన్న గ్రామంలో రామన్న అనే ఆసామీ ఉండేవాడు. అతనికి సుబ్బన్న అనే తమ్ముడూ, గౌరి అనే చెల్లెలూ ఉండే వారు. రామన్న భార్య లక్ష్మి సుబ్బన్ననూ, గౌరినీ ఎంతో అభిమానంగా చూసేది. ఆ కుటుంబం ఆ గ్రామానికే ఆదర్శ ప్రాయంగా ఉండేది.

చంపక దేశానికి పొరుగున ఉన్న దేశంతో యుద్ధం వచ్చింది. శత్రుసైనికులు సరిహద్దులో ఉన్న శంభవరం మీద వచ్చి పడబోతున్నట్టు పుకారు పుట్టింది. గ్రామ స్థులు భయపడి ఊరు వదిలి పారి పోయారు. అందరితోబాటు రామన్న కుటుంబం కూడా మరొక గ్రామానికి వలస వెళ్ళింది.

శంభవరం గ్రామాన్ని దరిమిలా శత్రు వులు ఆక్రమించారు.

రామన్న కొత్త చోట, కొత్త జీవితం ప్రారంభించవలసి వచ్చింది. సుబ్బన్నకు చదువు అబ్బలేదు గాని, రామన్న బాగా చదువుకున్నవాడు. లక్ష్మికి సంగీతం వచ్చును. ఇద్దరూ కలిసి చిన్న గురుకులం స్థాపించారు. గౌరి ఇల్లు చూసుకుంటూ అన్నకూ, వదినెకూ చేదోడు, వాదోడుగా ఉండేది. సుబ్బన్న సమీపంలో ఉన్న అరణ్యం నుంచి కట్టెలూ, పనికివచ్చే ఇతర వస్తువులూ తెచ్చేవాడు. ఒక సంవత్సర కాలంలో రామన్న కొంత డబ్బు వెనకవేసి, రెండెకరాల భూమి కొన్నాడు. సుబ్బన్న అరణ్యానికి పోవటం మానేసి, వ్యవసాయం ప్రారంభించాడు.

కుటుంబ పరిస్థితి మళ్ళీ బాగు పడు తున్నది. రామన్న సొంత ఇల్లు కొనుక్కో వాలని ఆలోచన చేశాడు. అందుకు కారణం, అతను ఆ గ్రామానికి వచ్చిన

జొన్నలగడ్డ రామలక్ష్మి

నాటి నుంచీ ఒక ఇల్లు అమ్మకానికి ఉన్నది. ధరకూడా ఆట్టేలేదు. అయినా దాన్ని కొనడానికి ఎవరూ ముందుకు రావడం లేదు. ఆ ఇల్లు కొనాలని రామన్న ఉబలాట పడుతూంటే చూసి, ''అలాటి తెలివితక్కువ పని చేయకు. ఆ ఇంటికి ఎదురింటో ఉన్న మంగమ్మ చాలా ప్రమాదకరమైన మనిషి,'' అని ఒక శ్రేయోభిలాషి అన్నాడు.

ఒక ఆడమనిషికి భయపడి చవగ్గా వస్తున్న ఇల్లు వదులుకోవడం రామన్నకు నచ్చలేదు. డబ్బు సమకూడగానే అతను ఆ ఇల్లు కొనేసి, మంచిరోజు చూసి గృహప్రవేశం చేశాడు. గృహప్రవేశానికి ఎదురింటి మంగమ్మ కూడా వచ్చింది. ఎంతో కాలానికి తన చుట్టుపక్కలకు ఒక కుటుంబం వచ్చినందుకు ఆమె ఎంతో సంతోషించింది.

మంగమ్మ ఇంటో ఆమే, ఆమె భర్తా ఉంటున్నారు. వారికి పిల్లలు లేరు. బంధువులున్నారు గాని మంగమ్మకు వారితో పడదు. మంగమ్మ లక్ష్మితో స్నేహం చేసింది. కొంతకాలం బాగానే గడిచింది.

లక్ష్మి తన ఇంటికి వచ్చిన పిల్లలకు సంగీతం నేర్పేది. రామన్న దొడ్లో చెట్టు కింద పిల్లలకు చదువు చెప్పేవాడు. గౌరి వంటపనీ, ఇంటిపనీ అంతా చూసుకునేది.



సుబ్బన్న ఉదయమే లేచి పొలానికి వెళ్ళి, మళ్ళీ రాత్రికి ఇల్లు చేరుకునేవాడు.

మంగమ్మ గౌరిని రోజూ కాస్సేపు తన ఇంటికి పిలిచి, కబుర్లు చెప్పేది; చిన్న వయసులోనే ఆమె భారీపనులు చేస్తున్నందుకు జాలిపడి, ''అయినా అంతపనీ నువే చేస్తావేం? మీ వదినకు కూర్చుని పాటలు పాడడం తప్ప ఇంకోపని రాదా?'' అని అడిగేది.

''అలా గనకండి. మా వదిన దేవత! వచ్చే సంవత్సరం నాకు పెళ్ళి చెయ్యాలనుకుంటున్నారు. పని నేర్చుకోవాలని అంతా నాకు అప్ప జెప్పింది. మా వదిన నాకు కావలసిన వన్నీ కొనిపెడుతుంది.

నన్ను ఎంతో అభిమానంగా చూసుకుంటుంది,'' అని గౌరి వినయంగా జవాబు చెప్పింది.

''నీ లాంటి ఆడబడుచు రావడానికి ఎన్ని దేవుళ్ళకు మొక్కాలో! ఎంత డబ్బిచ్చినా నీలా ఎవరూ పని చెయ్యరు. మీ వదిన అదృష్టం! అయినా, మరీ ఇంత అమాయకురాలివి, ఎలా బతుకుతావో, ఏమిటో ?'' అని మంగమ్మ గౌరి మీద చాలా జాలిపడేది.

ఈ రకం మాటలు మొదట్లో గౌరి మీద పని చెయ్యలేదుగాని, క్రమంగా ఆమెలో అనుమానం తల ఎత్తింది. తాను తెలివి తక్కువది గనకనే,తన వదిన తనచేత అడ్డమైన వెట్టిచాకిరీ చేయిస్తూ తాను సుఖంగా కూర్చుంటున్నది! ఈ అనుమానం వచ్చినప్పటి నుంచీ గౌరికి తన వదిన దుర్మార్గురాలుగా కనిపించసాగింది.

మంగమ్మ సుబ్బన్న మీద కూడా ఇలాగే జాలిచూపింది.

''నిన్ను ఎవరూ రామన్నకు తమ్ముడివి అనుకోరు, అతని పాలేరు వనుకుంటున్నారు,'' అన్నది మంగమ్మ అతనితో.

''ఏం చేస్తాను ? నాకు చదువురాలేదు. ఊరికే కూర్చోవడం ఇష్టంలేదు. అన్నయ్య నన్ను బాగా చూసుకుంటాడు. ఎవరు ఏమనుకుంటే నా కేం?'' అన్నాడు సుబ్బన్న.

''ఊరందరికీ చదువు చెప్పే మీ అన్న నీకు చదువు చెప్పలేకపోయాడా? అయినా



నీకు చదువువస్తే, తనకు ఊడిగంచేసే వాళ్లు ఎవరుంటారు ? అందుకే నీకు చదువురాకుండా చేశాడు !'' అన్నది మంగమ్మ.

సుబ్బన్నకు కూడా క్రమంగా, మంగమ్మ మాటలు నిజమనిపించ సాగాయి. ఈ సంగతి ఎవరితో చెప్పుకో వాలో అతనికి తెలియలేదు, చెల్లెలు గౌరికే చెప్పుకున్నాడు. గౌరి తన గోడు సుబ్బన్నకు చెప్పుకున్నది. తమ ఇద్దరికీ ఏదో అన్యాయం జరిగి పోతున్నదని ఆ ఇద్దరూ నిర్ధారణ చేసుకున్నారు.

గౌరికి కూడా సంగీతం వచ్చును. అమె ఒక రోజున లక్ష్మితో, ''వదినా, ఇంటి పని చెయ్యటం నాకు చాలా విసుగుగా ఉంటున్నది. కొంతకాలం నువు ఆ పని చూడు, నేను పాఠాలు చెబుతాను,'' అన్నది.

అందుకు లక్ష్మి వెంటనే ఒప్పుకున్నది.

సుబ్బన్న కూడా తన అన్నతో, ''నా వంట్లో బాగుండడం లేదు. కొంతకాలం పాటు ఇంట్లో ఉండి చదువుకుంటాను. పొలం పనికి మనం ఒక పాలేరును పెట్టు కుందాం,'' అన్నాడు.

అందుకు రామన్న సంతోషంగా అంగీక రించాడు.

లక్ష్మి ఇంటి పనులు సునాయాసంగా చేసుకుపోతున్నది. కాని పాఠాలు చెప్పడం గౌరి వల్ల కావడంలేదు. తాను చెప్పేది త్వరగా నేర్చుకోవడం లేదని ఆమె పిల్లల





మీద మాటిమాటికీ కసురుకునేది. ఈబాధ భరించలేక సంగీతం నేర్చుకునే పిల్లలు చాలామంది మానుకున్నారు. ఆదాయం తగ్గిపోయింది.

ఏడాదిపాటు ఇంట్లో కూర్చున్నా కూడా సుబ్బన్నకు చదువు వంట బట్టలేదు. వ్యవసాయం చెయ్యడంలో పాలేరు శ్రద్ధ చూపలేదు. ఆ రాబడికూడా తగ్గిపోయింది అందులో కొంత వాడిజీతంకిందే పోయింది.

ఇలా జరగడంవల్ల లక్ష్మి గౌరికి ఆ ఏడు చేయింతామనుకున్న కాసులపేరు చేయించలేకపోయింది! రామన్న తాను కొందా మనుకున్న ఎకరం పొలం కొన లేకపోయాడు.

లక్ష్మి గౌరిని దగ్గిరికి తీసుకుని, ''నువు సంగీత పాఠాలు చెప్పవద్దు. నీకు ఇంటి పని భారంగా ఉంటే ఇంటి పనితోబాటు సంగీత పాఠాలు కూడా చెప్పుకుంటాను,'' అన్నది.

రామన్న తన తమ్ముణ్ణి దగ్గిరికి తీసు కుని, ''నీకు వంట్లో ఆరోగ్యం చిక్కే వరకూ నేను పొలం పనులు స్వయంగా చూసుకుంటూ పాఠాలు చెప్పుకుంటాను,'' అన్నాడు.

ఈ ఏర్పాటు గురించి గౌరి గాని, సుబ్బన్న గాని ఏమీ అనలేదు.

అది మొదలు లక్ష్మికీ, రామన్నకూ శ్రమ చాలా ఎక్కువ అయింది. మంగమ్మతో మాట్లాడటానికి గౌరికీ సుబ్బన్నకూ తీరిక కూడా ఎక్కువ అయింది. మంగమ్మ వాళ్ళిద్దరినీ అభినందించేది.

మంగమ్మ మూలానే గౌరిలోనూ, సుబ్బన్నలోనూ మార్పువచ్చిందని లక్ష్మికీ, రామన్నకూ తెలుసు. తమ మంచి తనంతో వాళ్ళిద్దరినీ మార్చాలని చూశారు, కాని ఆ ప్రయత్నం ఏ మాత్రం ఫలించ లేదు, అందుచేత రామన్న ఒక ఉపాయం ఆలోచించాడు.

ఒక రోజున రామన్నా, లక్ష్మి ఏదో రహస్యంగా మాట్లాడుకుంటున్నట్టు నటిం చారు. గౌరీ, సుబ్బన్నా వారి సంభాషణ

పొంచి విన్నారు. వాళ్ళకు వినిపించేలాగే భార్యాభర్తలు ఇలా మాట్లాడుకున్నారు.

''గౌరికి పనిచెయ్యడం ఇష్టమేనుట, కాని నాకు సాయం చెయ్యడమే ఇష్టం లేదుట! మా ఇద్దరికీ ఒకరంటే ఒకరికి ప్రాణమని తెలీక, గౌరిమీద నాకు నేరాలు చెబుతున్నది మంగమ్మ! నేను నమ్ముతాననుకున్నదేమో!'' అన్నది లక్ష్మి.

''సుబ్బన్న గురించి ఆవిడ నాకూ అలాగే చెప్పింది. నేను నమ్మలేదు,'' అన్నాడు రామన్న.

''గౌరికి నా మాటకన్నా తనమాటమీదే గురి ఎక్కువట! మంగమ్మ చెబితే, గౌరి నన్ను చీపురుకట్టతో కొట్టమన్నా కొట్టుతుందిట! మంగమ్మ ఇలా అన్నట్టు గౌరికి తెలిస్తే, మంగమ్మనే చీపురుకట్టతో కొట్టడానికి పోతుంది!'' అన్నది లక్ష్మి.

''తాను చెబితే నా తమ్ముడు నన్ను జుట్టు పట్టుకుని వీధిలోకి ఈడుస్తాడన్నది, మంగమ్మ. ఈ మాట ఏనాడయినా వాడి చెవిన పడిందో వాడు, తననే జుట్టు పట్టుకుని వీధిలోకి ఈడ్చుకు వస్తాడు!'' అన్నాడు రామన్న.

ఇలా భార్యాభర్తలు చాలా సేపు మాట్లాడు కున్నారు. కొంతసేపు అయాక వాళ్ళు ఇవతలికి వచ్చి చూస్తే, గౌరీ, సుబ్బన్నా లేరు. వీధిలో ఏదో కలకలం అయింది.

భార్యాభర్తలు వీధిలోకి చూసి ఆశ్చర్యపోయారు. అప్పటికే చాలామంది పోగై ఆ దృశ్యాన్ని చూసి వినోదిస్తున్నారు.

సుబ్బన్న మంగమ్మను జుట్టు పట్టుకుని వీధిలోకి ఈడ్చుకు వచ్చాడు. గౌరి ఆమె వీపు మీద చీపురు తిరగేస్తున్నది.

రామన్న చటుక్కున వెళ్ళి గౌరినీ, సుబ్బన్ననూ చెరొక చేత్తోనూ ఇంట్లోకి లాక్కువచ్చాడు.

మర్నాడే మంగమ్మా, ఆమె భర్తా తమ ఇల్లు అమ్ముకుని, ఖాళీ చేసి వెళ్ళిపోయారు. ఎందుకంటే, కలిసి మెలిసి అప్యాయంగా ఉండే కుటుంబానికి ఎదురుగా మంగమ్మలు ఉండలేరు.



# తెలివైన మంత్రి

విజయపురిలో సింగన్న అనే గజదొంగ వరసగా దొంగతనాలూ, హత్యలూ చేస్తూ, రాజభటు లకు పట్టుబడకుండా తప్పించుకుంటూ వచ్చాడు. అందుచేత రాజు వాణ్ణి పట్టిన వాళ్ళకు వంద బంగారు మొహరీలు ఇస్తానని చాటింపు వేశాడు.

ఒకరోజు రామయ్య అనే రైతు చీకటితో పొలానికి పోతుండగా, ఊరికేసి వస్తున్న ఇద్దరు ప్రయాణీకులను ఎవడో దొంగ అటకాయించి, దోచుకోవటం అతని కంటపడింది. వాడే గజ దొంగ సింగన్న అయి ఉంటాడనుకుని రామయ్య ఒక చెట్టు చాటున దాగి, దొంగ అటుగా రాగానే తన భుజం మీద ఉన్న పగ్గం విసిరి దొంగను పట్టుకుని బంధించి, వాణ్ణి లాక్కుని రాజుగారి వద్దకు బయలుదేరాడు.

రామయ్యకు కామయ్య అనే మరో రైతు ఎదురై, విషయం ఏమిటని అడిగితే, తాను గజదొంగను పట్టాననీ, రాజుగారు తనకు వంద బంగారు మొహరీలు ఇస్తాడనీ చెప్పాడు రామయ్య. వెంటనే కామయ్య రామయ్య నెత్తిన తన చేతికర్రతో బలంగా కొట్టి స్పృహ తప్పించి, దొంగను తీసుకుని రాజుగారి దగ్గిరికి తానే బయలుదేరాడు.

కామయ్యకు రాజసభలో ప్రవేశం దొరికే లోపల రామయ్యకు స్పృహ వచ్చి, రాజసభకు చేరాడు. దొంగను ఇద్దరూ నేనంటే నేను పట్టుకున్నాననటం చూసి రాజు మంత్రికేసి చూశాడు. మంత్రి దొంగను దగ్గిరకు రప్పించుకుని, "వీడు దొంగకాదు, మహారాజా! మన ఆస్థాన జ్యోతిష్కుడి కొడుకు!" అన్నాడు

వెంటనే కామయ్య, దొంగను పట్టుకున్నది తాను కాదనీ, రామయ్యేననీ అన్నాడు. రాజు కామయ్యకు ఇరవై కొరడా దెబ్బలూ, రామయ్యకు నూరు మొహరీలూ మంజూరు చేశాడు.

—జి. వెంకట సూర్యనరసింహారెడ్డి





# దేవీ భాగవతం

హరిశ్చంద్రుడి భార్య దుఃఖించింది. ప్రపంచమంతా ఏలి, బ్రాహ్మణులకు అంతులేని దానాలిచ్చి, సత్యసంధుడని కీర్తి తెచ్చుకుని, ఇంద్రుడికీ, విష్ణువుకూ సమానుడని అనేక సార్లు అందరిచేతా అనిపించుకున్న వాడికి ఇలాటి దుస్థితి ఎందుకు కలిగిందో ఆమెకు అర్థం కాలేదు. దుఃఖావేశంలో ఆమె కూడా మూర్ఛపోయింది.

తల్లిదండ్రులు ఇలా మూర్ఛలో ఉంటే కొడుకు రోహితుణ్ణి ఆకలి బాధిస్తున్నది. నాలుక ఎండిపోతున్నది. తింటే గాని ప్రాణం నిలిచేటట్టు లేదు. తనకు ఏదైనా కావాలని వాడు తల్లితండ్రులను ఏడుస్తూ అడుగుతున్నాడు!

అంతలో విశ్వామిత్రుడు యముడి లాగా వచ్చి, మూర్ఛపోయి ఉన్న హరిశ్చంద్రుడి ముఖాన చన్నీరు చల్లి స్పృహ తెప్పించి, "అన్నమాట నిలుపుకోదలిస్తే నా దక్షిణ నా కియ్యి! సూర్యాస్తమయం లోపల నా దక్షిణ నా కియ్యక పోయావో నిన్ను నిశ్చయంగా శపిస్తాను!" అన్నాడు రౌద్రంగా.

విశ్వామిత్రుడు ఇలాఅని వెళ్ళిపోయిన కొద్ది సేపటికి అటుగా ఒక బ్రాహ్మణుడు వేదాధ్యయన పరుడు వచ్చాడు. అతని వెనక చాలామంది బ్రాహ్మణులున్నారు.

హరిశ్చంద్రుడి భార్య ఆ బ్రాహ్మణ్ణి చూసి తన భర్తతో, "చాలా మందిని వెంటవేసుకుని వస్తున్నాడు బ్రాహ్మడు!



ధర్మాన్ని పోషించ వలసిన బ్రాహ్మణుడు ఇంత దురన్యాయం చేస్తాడా ?'' అన్నది రాణి.

దానికి హరిశ్చంద్రుడు, ''దేవీ, కత్తితో నాలుక అయినా కోసేసుకుంటాను గాని, ఒకర్ని 'దేహీ!' అని అడుగుతానా ? త్రిశంకుడి కొడుక్కు అంత దైన్యమా ? చేతనైతే భుజబలంతో ధనం సంపాదిస్తాను గాని, యాచించి డబ్బు సంపాదించను !'' అన్నాడు.

''యాచించటానికి అభ్యంతరమైతే నన్ను అమ్మి, నీ కీర్తి కాపాడుకో. అమ్మినా, అందల మెక్కించినా, దించినా, అన్నిటికీ భార్య అనే వస్తువు పనికి వస్తుంది గదా !'' అని భార్య అనే సరికి, హరిశ్చంద్రుడికి దుఃఖం పొర్లివచ్చింది.

అది చూసి ఆమె హరిశ్చంద్రుణ్ణి ఓదార్చుతూ, ''జూదానికికాదు, తాగుడుకు కాదు, భోగానికి కాదు సత్యం నిలబెట్టుకునేటందుకు భార్య నమ్మటం తప్పా ?'' అంటూ అనేక విధాల నచ్చజెప్పి, హరిశ్చంద్రుణ్ణి ఒప్పించింది.

అప్పుడు హరిశ్చంద్రుడు ఆమెతో, ''సరే, నీ మాట విని, ఎవడూ చెయ్యని పని చేస్తాను. ఏ యుగంలోనైనా భార్యను అమ్ముకున్న పాపాత్ముడు ఉంటాడా ? భాగ్యహీనుణ్ణి గనక నలుగురిలోనూ తల

అతన్ని అడిగితే డబ్బు ఇస్తాడేమో ? రాజు మిగిలిన మూడు వర్ణాల వారికి తండ్రి వంటివాడు గనక, కొడుకుల నుంచి ధనం పుచ్చుకోవటంలో తప్పేమీ ఉండదు !'' అన్నది.

దానికి హరిశ్చంద్రుడు, ''క్షత్రియ జన్మ ఎత్తిన నేను చెయ్యి జాచి ఎలా యాచిస్తాను ? పుచ్చుకునే అధికారం బ్రాహ్మలకే ఉంటుంది. వారు మిగిలిన వర్ణాల వారికి గురువులు. గురువులను యాచించరాదు గదా !'' అన్నాడు.

''కాలమూ, యోగమూ అనే వాటిని బట్టి మానావమానాలూ, దానం ఇచ్చి పుచ్చుకోవటాలూ జరుగుతాయి. కాకపోతే

వంపులు అయే పని చేయక తప్పదు,'' అన్నాడు.

అతను తన భార్యను ఒక చోట నిల బెట్టి, గద్గద స్వరంతో, దారిన పొయ్యే వారితో ఇలా అన్నాడు :

''నాగరికులారా! కరుణామయులారా! ఈమె నా భార్య. ఎవరైనా కొనదలిస్తే అమ్ముతాను. తగిన డబ్బు ఇయ్యగల వారుంటే ముందుకు రండి!''

త్వరలోనే అతని చుట్టూ వింతగా జనం పోగై, భార్యను అమ్ముకోవలసి నంత అగత్యం ఏం వచ్చిందని అడిగారు.

వారికి హరిశ్చంద్రుడు, ''అయ్యా, సగం చచ్చి ఈ పాడు పనికి ఒడిగట్టాను! పాపాత్ముణ్ణి! పరమ కిరాతకుడైన రాక్ష సుడి లాటి వాణ్ణి! నా పేరు తలిస్తేనే పాపం! అలాటి నన్ను గురించి మీకు దేనికి? కావలిస్తే ఈమెను తగిన ధర ఇచ్చి కొనుక్కోండి!'' అని గట్టిగా అరుస్తూ చెప్పాడు.

విశ్వామిత్రుడు మరొక ముసలి బ్రాహ్మడి రూపంలో వచ్చి, ''డబ్బు కట్టుకు పోయినంత ఉన్నది. పెళ్ళాం మహా సుకుమారి, పని చేయలేక చాలా అవస్థపడుతున్నది. అడిగినంత ధనం ఇస్తాను, నిజంగా నీ భార్యను అమ్ము తావా?'' అని అడిగాడు.



హరిశ్చంద్రుడికి జవాబు చెప్పటానికి నోరు రాలేదు.

మళ్ళీ విశ్వామిత్రుడే, ''ముప్పైరెండు లక్షణాలూ గల స్త్రీ విలువ కోటి అనీ, పురు షుడి విలువ అర్బుదం (వెయ్యికోట్లు) అనీ శాస్త్రాలు చెబుతున్నాయి గనక, ఈ స్త్రీని ఆ ధరకు కొని ఇంటికి తీసుకు పోతాను!'' అన్నాడు.

హరిశ్చంద్రుడికి నోట మాట లేదు.

బ్రాహ్మడికి కోపం వచ్చింది. అతను డబ్బు హరిశ్చంద్రుడి ముందు పోసి, అతని భార్యతో, ''నువు ఇప్పుడు నా దాసివి. పదపోదాం!'' అంటూ జుట్టుపట్టి లాగాడు.



నేను పనీపాటలు సరిగా చెయ్యలేను!'' అన్నది.

దానికి ఆ బ్రాహ్మడు ఒప్పుకుని, రోహితుడు మగవాడు గనక అతని మూల్యం వెయ్యి కోట్లూ ఇచ్చి, తల్లికొడుకులను తన వెంటరమ్మన్నాడు.

ఆ ఇల్లాలు తన భర్తకు ప్రదక్షిణం చేసి, తన తల అతని కాళ్ళమీద పెట్టి, ఏడుస్తూ, ''ఎన్ని జన్మలకైనా ఈయనే నాకు భర్త కావాలి!'' అన్నది.

ఆమె రానున్న కష్టాలను ఎలా ఎదుర్కొంటుందో, తాను లేకుండా ఎలా బతుకుతుందో హరిశ్చంద్రుడు ఊహించలేకపోయాడు. తన కొడుకు తనకు దూరమవుతున్నాడన్నది హరిశ్చంద్రుణ్ణి చాలా బాధించింది. రాజ్యం త్యాగం చెయ్యటం కన్న పుత్రత్యాగం చాలా దుర్భరంగా తోచింది.

కొంతసేపు చూసి ఆ బ్రాహ్మడు తన బానిసలను కొట్టి లాక్కుపోతుంటే హరిశ్చంద్రుడు ఏమీ చెయ్యలేక పోయాడు! అతని శోకం మిన్నుముట్టింది. ఆ స్థితిలో విశ్వామిత్రుడు శిష్యులతో సహా వచ్చి, ''అబద్ధం ఆడదలచక పోతే నా దక్షిణ నా కియ్యి!'' అన్నాడు.

హరిశ్చంద్రుడు తన భార్యనూ, కొడుకునూ అమ్మిన తాలూకు ధనాన్ని విశ్వా

తనను బలాత్కారంగా ఈడ్చుకుపోతున్న బ్రాహ్మడితో ఆమె, ''అయ్యా! నన్ను విడిచిపెట్టు. నేను నా కొడుకుని విడవలేను. పతివ్రతను. నన్ను తాకకు,'' అన్నది.

రోహితుడు కూడా, ''అమ్మా! అమ్మా!'' అని పెద్దగా ఏడ్చాడు, తల్లి వెంటబడి.

''ఛీ!'' అని ఆ బ్రాహ్మడు కుర్రవాణ్ణి కొట్టాడు.

అది చూసి హరిశ్చంద్రుడి భార్య బ్రాహ్మడితో, ''అయ్యా, నన్ను కొన్నట్టుగానే, నా కొడుకును కూడా కొను. నాకు వాడొక్కడే కొడుకు. వాడికి దూరమై

మిత్రుడికి ఇచ్చాడు. అది చాలదన్నాడు విశ్వామిత్రుడు. ఆయన సాయంకాలం దాకా మిగిలిన ధనానికి గడువు ఇచ్చి వెళ్ళిపోయాడు.

హరిశ్చంద్రుడు తనను తాను అమ్ము కోవటానికి సిద్ధపడ్డాడు. ఇంతలో ఒక వికృతాకారుడైన చండాలుడు అటుగా వచ్చి, హరిశ్చంద్రుడితో, "చూడు, నేను ప్రవీరు డనే చండాలుణ్ణి. నా కింద పని చేస్తావా ? శవాల మీది గుడ్డలు తీయటం ఆ పని" అన్నాడు.

"నేను బ్రాహ్మణ, క్షత్రియులకు మాత్రమే అమ్ముడు పోతాను !" అన్నాడు హరిశ్చంద్రుడు.

"అమ్ముడుపోతానన్న వాడివి ఇప్పుడు మాట తప్పిస్తున్నావు. అబద్ధం ఆడేవాడికి అనేక మార్గాలు !" అన్నాడు ప్రవీరుడు.

అబద్ధం ఆడాననిపించుకోవడం కన్న చండాలుడికి అమ్ముడు పోవటమే మేలను కున్నాడు హరిశ్చంద్రుడు. ఇంతలో తన బాకీ వసూలు చేసుకోవటానికి విశ్వామిత్రుడు అక్కడికి రానే వచ్చాడు. ఇక హరిశ్చంద్రుడికి అమ్ముడుపోక తప్పలేదు. ఆ పరిస్థితిలో హరిశ్చంద్రుడు విశ్వామిత్రుడి కాళ్ళమీద పడి, "స్వామీ, మరొకరెందుకు ? మీకే అమ్ముడవుతాను. మీ ఋణం కింద నన్ను కొనుక్కొని, మీ



ఇష్టం వచ్చినట్టు నా చేత చేయించు కోండి !" అని ప్రాధేయపడ్డాడు.

"అలాగా ? అయితే సరే !" అని విశ్వామిత్రుడు చండాలుడితో, "ఈ మనిషి నాకు బానిస అయాడు. కాని నాకు యితడితో పనిలేదు. నాకు డబ్బు కావాలి. ఇతన్ని నువు కొనుక్కో !" అన్నాడు.

ప్రవీరుడు విశ్వామిత్రుడికి వేలకొద్దీ రత్నాలూ, ముత్యాలూ, అంతులేని బంగారమూ ఇచ్చి, హరిశ్చంద్రుణ్ణి తన బానిసగా కొనుక్కున్నాడు. ఎలాగైతేనేం, హరిశ్చంద్రుడికి ఋణవిముక్తి కలిగింది.

హరిశ్చంద్రుడు పారిపోతాడేమోనని, చండాలుడు అతన్ని కట్టిమరీ తీసుకు



పోయాడు. నాలుగురోజులు హరిశ్చంద్రుణ్ణి కట్టి ఉంచి, తరవాత కట్లు విప్పి శవాలమీది గుడ్డలు తీసుకు రావటానికి నియోగించాడు చండాలుడు.

ఊరికి దక్షిణాన శ్మశానం ఉన్నది. హరిశ్చంద్రుడు అక్కడికి వెళ్ళాడు. శవాలు వస్తూంటాయి. వాటి దహనానికి డబ్బు వసూలు చెయ్యాలి. రాత్రీ, పగలూ వచ్చే శవాలను చూస్తూండాలి.

ఇలా ఉండగా ఒకనాడు రోహితుడు తన యజమాని అయిన బ్రాహ్మడి కోసం సమిధలు ఏరుతూ, ఒక పుట్ట ఎక్కి, పాము కాటు తిని, పడిపోయాడు. ఈ వార్త అతని తల్లికి చేరింది. ఆమె మతిపోయి ఏడుస్తూ కూర్చుంటే, ఆమెను కొన్న బ్రాహ్మడు, "బోలెడంత డబ్బు పోసి నిన్ను కొన్నది పని చెయ్యటానికా? ఏడుస్తూ పొర్లిగింతలు పెట్టటానికా? లక్ష్మి వచ్చే వేళ ఏడుస్తావా?" అని తిట్టాడు.

ఆ మాటలు ఏవీ అర్థంకాక ఆమె మరింతగా ఏడ్చింది. అయితే ఆ బ్రాహ్మడు అర్ధరాత్రి దాకా ఆమె చేత ఇంటి చాకిరి చేయించి గాని, కొడుకు శవాన్ని చూసుకోవటానికి పోనియ్యలేదు. వెళ్ళేటప్పుడాయన ఆమెతో, "నీ కొడుకును తెల్లవారే లోపల దహనం చేసి తిరిగిరా! ఆలస్యం చేసేవు!" అన్నాడు.

అర్ధరాత్రి వేళ ఆమె కొడుకును వెతుక్కుంటూ బయలుదేరి, రోహితుడి శవాన్ని చూసి, గుండె పగిలేటట్టు వైన వైనాలుగా ఏడవసాగింది. ఆమె వద్దకు తలార్లు వచ్చి "ఇది పిల్లల్ని చంపుకు తినేదిలా గున్నది, పిశాచి!" అని జుట్టు పట్టుకుని చండాల వాటికకు లాక్కుపోయి, ప్రవీరుడి (వీరబాహుడి) తో, "దీన్ని వధించు!" అని చెప్పారు. వాడు తన బానిస అయిన హరిశ్చంద్రుణ్ణి పిలిచి, ఆమెను వధించమన్నాడు, కత్తి ఇచ్చి.

హరిశ్చంద్రుడు తన భార్యను గుర్తించక, తను చేయబోతున్నపనికి విచారిస్తూ,

"ఏమమ్మా! నేను నీ తల నరక బోతున్నాను!" అన్నాడు.

"అయ్యా! నా కొడుకు చచ్చిపోయాడు. వాణ్ణి తెచ్చి దహనం చేసినదాకా ఆగు!" అన్నదామె.

హరిశ్చంద్రుడు, సరే అన్నాడు.

ఆమె వెళ్ళి కొడుకు శవాన్ని తెచ్చి, ఏడుస్తూ కూర్చున్నది. హరిశ్చంద్రుడు తన విధి చొప్పున శవంమీది బట్ట లాగేసుకున్నాడు.

కాని ఆమె తన భార్యే నన్న సంగతి క్రమంగా హరిశ్చంద్రుడికి స్ఫురించింది. అయితే ఆ చచ్చిన కుర్రవాడు తన కొడుకే! అతను కూడా దుఃఖం అపుకోలేక ఏడవసాగాడు. అతను తన భర్తే నని ఆమెకు కూడా క్రమంగా తెలిసింది. తమ గతి చివరకు ఎలా అయినదీ ఇద్దరూ గ్రహించారు. హరిశ్చంద్రుడు కొడుకు శవాన్ని కౌగలించుకుని మూర్ఛపోయాడు.

తరవాత తన పాట్లన్నీ ఆమె తన భర్తకు చెప్పుకున్నది. ఆమె అతన్ని తన విధి నిర్వర్తించమనీ, తన తల నరకమనీ అన్నది. కాని హరిశ్చంద్రుడికి జీవితం మీద రోత పుట్టింది. అతను తన భార్యతో సహా కొడుకు చితిమీద కాలిపోవటానికి నిర్ణయించు కున్నాడు.

చితి పేర్చి దానిమీద కొడుకు శవాన్ని ఉంచి, భార్యాభర్తలు దేవిని ధ్యానించుతూ చితికి నిప్పు పెట్టబోతుండగా, బ్రహ్మ మొదలుగాగల దేవతలు ఇంద్రుడితో సహా వచ్చి తమను తాము తెలుపుకుని, చచ్చిపోయిన రోహితుడిపై అమృత వర్షం కురిపించారు. వాడు బతికి లేచాడు.

ఇంద్రుడు హరిశ్చంద్రుణ్ణి స్వర్గానికి ఆహ్వానించాడు. యముడు తానే చండాలుడి రూపం ధరించినట్టు హరిశ్చంద్రుడితో అన్నాడు.

తరవాత హరిశ్చంద్రుడు తన కొడుకును రాజుగా చేసి, తాను తన భార్యతో ఇంద్రుడి వెంట స్వర్గానికి వెళ్ళాడు.

—(అయిపోయింది)





# ఎత్తుకుపై ఎత్తు

రత్తయ్య బీదవాడు. అతని కూతురికి పెళ్ళి నిశ్చయమయింది. అతను కడుపు కట్టుకుని ఎలాగో కూడబెట్టిన డబ్బు తీసుకుని బస్తీకి వెళ్ళి బంగారు నగల దుకాణాలన్నీ తిరిగి, వజ్రాలశెట్టి దుకాణంలో ఒక నగ ఇతర చోట్లకన్న చాలా చవకగా దొరికితే కొన్నాడు.

అతను తన చింకి బట్టల చాటున ఆ నగను దాచుకుని, తన గ్రామానికి పోతుంటే, దారిలో ముగ్గురు మనుషులు కర్రలతో అతన్ని అటకాయించి, "నీ దగ్గిర ఉన్నదంతా బయట పెట్టు. లేకపోతే బుర్ర బద్దలు కొట్టేస్తాం!" అన్నారు.

రత్తయ్య ఆశ్చర్యపోయి, "నా లాటి పేదవాడి దగ్గిర ఏముంటుంది, బాబులూ? నన్ను వదలండి!" అన్నాడు.

రత్తయ్యను పలకరించినవాడే, కర్రను అతని భుజం మీద ఆనించి, "నీ బట్టల చాటున దాచిన నగ పైకి తియ్యి!" అన్నాడు.

రత్తయ్యకు చెమటలు పట్టాయి. తన కష్టార్జితమంతా ఆ నగలో ఉన్నది! దాని సంగతి వీళ్ళకు తెలిసిపోయింది!

అతను దేవుడా అంటూ వాళ్ళకు నగ ఇచ్చుకున్నాడు. దొంగలు దాన్ని తీసుకుని వెళ్ళిపోయారు.

నగ పోయింది గాని రత్తయ్య బుర్ర చురుకుగా పని చేస్తున్నది. తన చింకి బట్టల చాటున బంగారు నగ ఉన్నట్టు వాళ్ళకు ఎలా తెలిసింది? తనను పలకరించిన వాణ్ణి వజ్రాలశెట్టి దుకాణంలో చూసినట్టు రత్తయ్యకు స్ఫురించింది.

ఇది స్ఫురణకు రావడమే తరవాయి, రత్తయ్య తిరిగి బస్తీకి వచ్చాడు. అతను వజ్రాలశెట్టి దుకాణం సమీపిస్తూనే, తనను దోచిన ముగ్గురూ దుకాణం

ఎమ్. వి. వి. సత్యనారాయణ



బయట నిలబడి ఉండడం చూశాడు. రత్తయ్యకు. "దొంగలు!" అని గట్టిగా అరవాలనిపించింది. కానీ, ఈ బస్తీలో తన వంటి అనామకుడి మాట ఎవరు నమ్ముతారు? తాను నిజం ఎలా రుజువు చేస్తాడు?

ముగ్గురి లోనూ తన నుంచి నగ తీసుకున్నవాడు దుకాణంలోకి వెళ్ళాడు. తరవాత ఆ మనిషి డబ్బు తీసుకుని బయటికి వచ్చి, తాను తెచ్చిన డబ్బు మిగిలిన ఇద్దరితో అక్కడే పంచుకున్నాడు.

రత్తయ్యకు కడుపు మండిపోయింది. వజ్రాలశెట్టి ఈ మనుషుల ద్వారా తన కొనుగోలు దార్లను తానే దోస్తున్నాడు. అందుకే అతని ధరలు తక్కువ! ఈ సంగతి అధికారులకు నచ్చజెప్పటం తేలిక కాదు. అదీగాక, అధికార్లను శెట్టి లంచమిచ్చి కొనగలడు. అలాటి, వాణ్ణి నేరం చేస్తుండగా పట్టి ఇయ్యాలి గాని, వట్టి ఆరోపణలతో శిక్షించటం అసాధ్యం. రత్తయ్యకు ఒక ఆలోచన తట్టింది.

రత్తయ్య ఆ దుకాణం దగ్గరే పొంచి వుండి, తన లాంటి రైతే అందులో ప్రవేశించటంచూసి, తానుకూడా దుకాణంలోకి వెళ్ళి అక్కడి జనంలో కలిసి పోయి, ఆ రైతునూ, శెట్టినీ గమనించ సాగాడు.

వజ్రాలశెట్టి ఆ రైతుకు ఏదో నగ అమ్మబోతూ, తనను అడిగినట్టే, "మీది ఏ గ్రామం?....అక్కడికే వెళుతున్నావా? నడిచి వెళతావా, పాపం!" అంటూ సానుభూతిగా అడిగాడు.

ఆ ప్రశ్నలకు రైతు ముగ్ధుడై పోయి, ఉన్న సంగతి దాచకుండా చెప్పాడు.

రైతు దుకాణం నుంచి వీధిలోకి రాగానే, తనను దోచిన ముగ్గురూ కొద్ది దూరం అతని వెనకనే నడిచి, ఊరి పొలిమేర కేసి వెళ్ళిపోయారు.

వెంటనే రత్తయ్య ఆ రైతును కలుసుకుని, పక్క సందులోకి తీసుకుపోయి, తన ఊరూ, పేరూ, తన నగపోయిన విధమూ చెప్పాడు. అదృష్టవశాన ఆ

రైతు ఉండే ఊళ్ళో రత్తయ్య బంధువు లున్నారు; వాళ్ళను రైతు బాగా ఎరుగును.

"అన్నా, నీ నగను శెట్టి మనుషులు [illegible] దొంగలు [illegible] కొన్న వాళ్ళ కియ్యి. నీ అసలు నగ వాళ్ళ కంట పడకుండా జాగ్రత్త పడు. తరవాత వాళ్ళ సంగతి నేను చూస్తాను!", అన్నాడు రత్తయ్య రైతుతో.

"అసలు నగ నీ దగ్గిరే ఉండనీ! దొంగలు దొరికినాక తీసుకుంటాలే!" అంటూ రైతు తాను కొన్న బంగారు నగను రత్తయ్య కిచ్చేసి, చవకలో గిల్టు నగ కొని, తన దారిన తాను బయలు దేరాడు.

రత్తయ్య వజ్రాలశెట్టి దుకాణానికి వెళ్ళి, ఏడుపు మొహం పెట్టి, "శెట్టి గారూ, మీ వద్ద కొన్న నగనూ, మా [illegible]లోనే [illegible] రత్నం హారాన్నీ దారిలో ముగ్గురు దొంగలు కాజేశారు, మా ఊరు పోవాలంటే మొహం చెల్లడం లేదు! ఆ దొంగల్లో ఒకణ్ణి మీ దుకాణంలో చూశాను. వాణ్ణి గురించి మీరు ఏమైనా చెప్పగలరేమోనని వచ్చాను!" అన్నాడు.

దొంగలు రవ్వలహారం కాజేసిన సంగతి తన దగ్గర దాచారని శెట్టి అమితంగా కలవర పడ్డాడు. వాళ్ళు తనకు తెలియకుండా వ్యాపారం చేస్తున్నారన్న మాట! శెట్టి తన ఉద్రేకాన్ని అదుపులో



పెట్టుకునే ప్రయత్నంలో ఉంటే, రత్తయ్య మళ్ళీ ఇలా అన్నాడు:

''అంతేకాదు, శెట్టిగారూ! వాళ్ళు దోచిన నగలను ఇంకెక్కడో అమ్మి, వాటికి బదులు మాయ నగలను చేయించే ఆలోచనలో ఉన్నారు.''

''ఏమో, నువ్వు చెప్పే మనుషులను గురించి నా కేమీ తెలీదు. నువు వెళ్ళ వచ్చు!" అని శెట్టి రత్తయ్యను పంపేసి, దొంగల కోసం ఎదురు చూడసాగాడు.

కొంత సేపటికి దొంగలు రైతు వద్ద కాజేసిన గిల్టు నగతో వచ్చి, దాన్ని శెట్టికి ఇచ్చారు. శెట్టి దాన్ని చూసి, రత్తయ్య చెప్పినట్టు అది మాయ నగే అని తెలుసు కున్నాడు.

శెట్టికి ఒళ్ళు మండు కొచ్చింది.

''అసలు నగ ఎక్కడ?'' అని అతను దొంగలను అడిగాడు.

దొంగలు మొహాలు చూసుకున్నారు.

''ఇంతకు ముందు ఇంకోడి దగ్గిర రవ్వల హారం కాజేశారు. అది ఏదీ? దాన్ని కూడా నాకే ఇస్తే డబ్బు ఇయ్యక పోయానా?'' అన్నాడు శెట్టి

''రవ్వల హారమా?'' అంటూ దొంగలు నిర్ఘాంత పోయారు.

అదే సమయంలో రత్తయ్య న్యాయాధికారినీ, రక్షకభటులనూ వెంట బెట్టుకుని వచ్చాడు. అప్పటి దాకా వీధిలో వాళ్ళకోసం ఎదురు చూస్తున్న రైతు కూడా దుకాణంలోకి వచ్చాడు.

దొంగలు దొరికి పోయారు. రత్తయ్య రైతు నగ రైతుకు ఇచ్చేశాడు. రైతు న్యాయాధికారితో ఆ ముగ్గురు దొంగలూ తన వద్ద గిల్టు నగ దొంగిలించిన వైనం చెప్పాడు. ఆ గిల్టు నగ ఇంకా శెట్టి చేతి లోనే ఉన్నది!

రత్తయ్యకు అతని నగ తిరిగి రావటమే గాక, దొంగలను పట్టి ఇచ్చి నందుకు బహుమానంగా, దాని ధర కూడా తిరిగి వచ్చింది.

దొంగలనూ, శెట్టినీ రక్షకభటులు పట్టుకుపోయారు.



# అనుభవం

మేవాడ్‌లో ఒక ఆచారం ఉండేది. రాజుగారి తండ్రిగారి, లేదా తాతగారి అబ్దికం నాడు రాజ్యంలో ఒక ఇంటి మనిషికి రాజుగా ఉండే అవకాశం వచ్చేది.

ఒక ఏడు ఆ అవకాశం ఒక కాపు ఇంటికి వచ్చింది. ఆ ఇంట కాపూ, అతని భార్యా, కాపు కొడుకు జయరామ్ ఉన్నారు. వారిలో ఎవరైనా ఆ రోజు రాజు కావచ్చు. అయితే కాపు ఆ అవకాశాన్ని వినియోగించుకున్నాడు. అతని భార్యకూ, జయరామ్‌కూ అవకాశం లేక పోయింది.

మరుసటేడు యాదృచ్ఛికంగా ఆ ఇంటికే రాజును పంపే అవకాశం వచ్చింది. ఈసారి కాపు భార్య ఆ అవకాశాన్ని వినియోగించుకున్నది. ఈ యేడు కూడా జయరామ్ కోరిక తీరలేదు.

ఇరవై ఏళ్ళు గడిచాయి. జయరామ్ పెళ్ళాడి, ఒక ఇంటి వాడై, ఒక కొడుకును కూడా కన్నాడు. తలపని తలంపుగా రాజయే అవకాశం జయరామ్ ఇంటివాళ్ళకు వచ్చింది. జయరాం తలపాగా చుట్టుకుని, మంచి దుస్తులు ధరించి, ఆ రోజు రాజు కావటానికి బయలుదేరాడు.

అలా బయలుదేరిన జయరామ్ రెండు నిమిషాలలో తిరిగి వచ్చి, తన దుస్తులు విప్పేస్తూ, తన భార్య ఇదేమిటని అడిగేసరికి, "అబ్బాయిని వెళ్ళమను!" అన్నాడు.

—టి. వి. యస్. అరుణ్‌మూర్తి



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1981 ఫిబ్రవరి నెల సంచికలో ప్రకటింపబడును.







I. Uma Rani K. Sitharam

★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకు సంబంధం ఉండాలి.)

★ డిసెంబర్ నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రూ. 25/—లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని ఇతర విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి :—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

---

## అక్టోబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : జ్వాలాదీపం

రెండవ ఫోటో : జంబూద్వీపం

పంపినవారు : ఆర్. పట్టాభిరామరాజు, రిజర్వాయర్ రోడ్డు, తిరుపతి-1

బహుమతి మొత్తం రు. 25/—ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 188, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor: NAGI REDDI.

# చందాదారులకు గమనిక

'చందమామ' కాపీలు పంపుటకు మీ చిరునామాలో ఏదైనా మార్పుంటే 5-వ తేది లోగానే, మీ చందా నంబరు ఉదహరిస్తూ మాకు తెలపాలి, ఆలస్యమైతే మళ్ళీ నెల వరకు మీ క్రొత్త అడ్రసును అమలు పెట్టడానికి వీలుండదు.

డాల్టన్ ఏజన్సీస్
'చందమామ బిల్డింగ్స్'
మదరాసు - 26

# ఇదో ఇప్పుడే తీయ తీయని మజా

# న్యూట్రిన్

## లిక్కర్లు

మెత్తమెత్తని మిఠాయి-
న్యూట్రిన్ వారి కమ్మకమ్మని తయారీ




**జిహ్వ్ కష్ట మిఠాయి యందు ఫలరస పూరిత విందు!**

న్యూట్రిన్ కన్ఫెక్షనరీ కంపెనీ లిమిటెడ్, చిత్తూరు-517 002 (ఆం.ప్ర.)

# రామ్ శ్యామ్

## గురిచూసి కొట్టారు.



















